త్ర పితామహులు,

రోహిణీ స్టూడియోస్ అధిపతి,

దర్శకులు, నిర్మాతలు అయిన

ఉత్తమ కళాజీవి

శ్రీయుత హెచ్. యం. రెడ్డిగారికి

ప్రేమతో సమర్పిస్తున్నా.

ఇట్లు

ర చ యి త



వెలువడింది!

ఈ రచయితదే!

గొప్ప సాంఘిక నాటకం!

# పెళ్లిచూపులు

వెల: 1-0-0

పూర్తివివరాలకు :-

**సీతంరాజు వెంకటేశ్వరరావు.**

సత్యనారాయణపురం - విజయవాడ 2.

చదగినవి!

ఇంటా వుండతగినవి!

# "మేఘమాల"

## (గేయాలు)

ప్రతి వెల :

రచన :

సీతంరాజు వెంకటేశ్వరరావు.



వివరాలకు :

రాధాకృష్ణ బుక్ డిపో,

జగ్గయ్యపేట. (కృష్ణాజిల్లా)

సూరయ్య :- ... కథ

మోహనరావు :- ... సూరయ్య

శివపాదం :- ... సావిత్రి భర్త (అ.

రాముడు :- ... సావిత్రియింట్లో నౌకరు

బాబు :- ... సూరయ్య కొడుకు

శారద :- ... సూరయ్య భార్య

సావిత్రి :- ... శివపాదం భార్య

(యింకా డాక్టర్, యస్. ఐ. మొ॥ వస్తారు)



# పెళ్లియ్యాకచూడు

## 1వ రంగము

[స్థలం :- సావిత్రి యింట్లో వరండా, ఒక సోఫా, దానికి కొంత దూరంలో రెండు టేబులు. దానిచుట్టూ కుర్చీలు వుంటాయ్. గోడకు సావిత్రి యన్లార్జిమెంటుఫోటో, అటు యిటు సినిమాతారల ఫోటోలు తగిలించబడివుంటాయి. శివపాదం సోఫాలోకూర్చొని వుత్తరం వ్రాస్తూ, తిరిగి చికాకుతో వ్రాసినకాగితం చింపేస్తూవుంటాడు తెర నెమ్మదిగా యెత్తబడుతుంది. తెరలోపలనుంచి పాట వినిపిస్తుంటుంది.]

ఓ భారతీయులారా! యువతీయువకులారా!...
యువకుల్లార! యువతుల్లార!

పిల్లాజెల్లతో వచ్చారా – కులాసాగవున్నారా? ॥యువ॥
కలాకాదు మా కధాకాదు – జీవితగాధలు
తిలకించండి నగ్నసత్యమని నమ్మండి
పెళ్లవుతుందని వళ్లుమరిచిపోకండి
పెళ్లియ్యాకచూడండి – వళ్లుతెలిసి మెలగండి ॥యువ॥

యెంచిచూచినా యింతవరకు యీలోకంలో
మంచియన్నది లేనేలేదుర మోసపోకురా
ముందుగతిని ఆలోచించర మర్మముకాదిది
వద్దుర మనకి పెళ్లి, పెళ్లాం, పేచీయేల? ॥యువ॥

కాపరమంటే కష్టసుఖాలూ యెన్నోవుండె
ఆపలేముగా వచ్చేబాధలు అంతుండవుగా ॥యువ॥

శివ :- (విసుగుతో) నా స్సెన్సు మనబుర్రలో మెదడు ం
మట్టితో తయారుచేయబడిందేమోననిపిస్తోంది. కాకః
మనలో మనమాట యెన్నికాగితాలు వేస్టుచేసి
గోస్టయిన ఆలోచన యెందుకురాదు? (సిగరెట్ ముట్టిం
మా పెళ్ళయి ఆరేళ్ళయింది. యింతవరకు ఆలితో
సుఖం లేకపోగా వచ్చేవన్నీ అవాకులు, చెవాకులు.
పోనీ సావిత్రికి నాకు తెగతెంపులు చేసుకుందామాంటే
గుండెధైర్యం శూన్యం, కాగితంద్వారా విడాకులపత్రం
దాఖలుచేద్దామాంటే ముత్యాల్లాంటి నాలుగుమాటలు
వ్రాయటానికి అయిడియా రావటల్లేదు సరికదా, బుర్ర
వేడెక్కిపోతోంది, పాళీ అరిగిపోతోంది, సీరా తరిగి
పోతోంది, వేళ్ళు కొంకర్లుపోతున్నాయ్. యేమిటి
చేయటం? (ఆలోచించి మళ్లీ వ్రాయటం ప్రారంభిస్తాడు.)

రాముడు :- (బయటనుంచి వస్తాడు.)

శివ :- (అలికిడివిని వులిక్కిపడి వ్రాసేవ్రాసే వుత్తరాన్ని
సొరుగులోకితోస్తూ) ఎవరు ? (తేరుకొని) నువ్వా !

రాము :- యెవరనుకుండారు దొరా! యదవని నానే.

శివ :- సావిత్రనుకున్నాను.

రాము :- (నవ్వి) ఆయమ్మంటే మీకంత భయమెందుకు
దొరా?

శివ :- రాముడూ! అలవాటైంది హటాత్తుగాపోతుందా?

రాము:-అంతభయపడుతుండారుకామట్టే ఆయమ్మ మిమ్మల్ని
అట్లా చెవులిచ్చుకు ఆడిత్తోంది. అదే నాలాంటోడయితేనా

యదవని యెముకలుయిర్సి యింటెనకాల పారేశేవోణ్ణి. (మీసం సవరించుకుంటాడు) శివపాదంగారూ! మీరు భయపడినంతకాలం మీ జన్మ యింతే! రోసంతో మీసందువ్వి కల్లెర్రసేసి మీదకెల్లండి. ఆయమ్మ యెవడికోసం మీ మాటినదో సూత్తాను.

శివ :- (ఆలోచించి) రాముడూ! నువ్వొక సహాయంచేస్తావు?

రాము :- యదవని నానా? శెప్పండి. శాతనైతే సేత్తాను. శాగ్గమూ బంగారమూ?

శిస :- అయితే యిలాకూర్చో. (రాముడు సోఫాప్రక్కన క్రింద కూర్చుంటాడు) చూడు మనలోమనమాట నీమేలు మర్చిపోను.

రాము :- సంగతేంటో శెప్పండిదొరా!

శివ :- నాకూ సావిత్రికీ పెళ్ళయి ఆరేళ్ళయింది. పెళ్ళయ్యాక చూడు నాకూ దానికీ యేవిధంగానూ సరిపట్టంలేదు. అది అస్తమానం ఆ సూరయ్యనిపట్టుకు వ్రేలాడుతోందిగదా? అది నాకు ఎంతకష్టంగావుంటుందిరా?

రాము :- అందుకే నామాటిని యదవని నేను శెప్పినట్టు శేయండి. దెబ్బకి దేముడు దడుస్తాడు.

శివ :- నువ్వొన్నన్నా చెప్పు. మనలోమనమాట అదిమాత్రం నావల్లకాదురా. పురుషజన్మెత్తి చెప్పుకుంటే సిగ్గుచేటు. (విచారంగా) ముడేసిన ముండాకొడుకనన్నా కనికరించి కన్నెత్తిచూడకపోతే నే నేంకాను? యింట్లోనుంచి వెళ్ళి పోదామాంటే, దాన్నివిడిచి ఒక్కక్షణం వుండలేను.

పోనీ యింట్లో నేవుందామూంటే దాని ప్రవర్తన యేమీ బాగోలేదు. యేంచెయ్యటానికీ తోచటల్లేదు.

రాము :- అందుకు నానేటిశేయను?

శివ :- అదేమిట్రా అలాఅంటావ్ ? మనలోమనమాట. యేదన్నా సలహాయిస్తావనికాదూ నిన్నడిగింది.

రాము :- పాలేరుముండాకొడుకుని అయన్నీ నాకేటిశెలుస్తాయ్ ? మీరే ఆలోసించండి.

శివ :- మనలోమనమాట యింకా యేమాలోచించనురా ?

రాము :- (నవ్వి) ఆపాటి ఆలోసించటం శాతకానోరు పెళ్లెందుకు శేసుకుండారు ? ఆడదానికి మగాడంటే భయముండాలి. అది మీ ఆడోళ్ళదగ్గర అసలేలేదు సరికదా ఆయమ్మనిసూత్తే మీరే భయపడుతుంటారు. మీ కట్టాలు గట్టెక్కాలంటే కర్రపట్టి గట్టిగా వంచుకోండి. అంతకంటే యేరేదారేదినేదు. అదే మంచిపని.

శివ :- నీమంచిపని మన్నయిపోనూ అదుపులోపెట్టడం అసాధ్యమనేగా నిన్ను సలహాఅడిగింది.

రాము :- ఇదిగో శివపాదంగారూ! అంతకంటే యేంసలహాయియ్యమంటారు? యీ యదవని యేటిశేయమంటారు?

శివ :- దానికో పెద్దప్లాను వేశాను. నువ్వు "ఊఁ" అన్నావంటే దాంతో అన్నీ సానుకూలపడ్తాయి.

రాము :- శెప్పండి. మీమాటెప్పుడన్నా యదవని నాను కాదన్నానా ?

శివ:- అయితే విను. (అటుఇటూచూసి నెమ్మదిగా) యీసారి
ఆ సూరయ్యగాడు యింటికొచ్చినప్పుడు వెనకాలగా వెళ్లి
వాడి తల పగలగొట్టాలి.

రాము :- ఎవరు ?

శివ :- నువ్వే !

రాము :- (నవ్వి) మా మంచిసలహా యిచ్చారు. ఆయనగోరి
తల పగలకొడితే అమ్మగారిబుద్ధి మారుద్దా ? శివపాదం
గోరూ యదవని నానొకటే శెప్తా యినండి. బుద్ధి పుట్టనే
పుట్టకూడదు. పుట్టిందంటే పుడకల్తోపోవాల్సిందే. అంతే!
యీ యదవమాటలో యిశ్వాసంపుంసండి.

శివ :- అలాగనుకొని వూరుకుంటే యెలారా? దానికి వాడికి
బుద్ధిరావాలి. మా కాపురం కుదటపడాలి. అందుకు
వుపాయం కావాలి.

రాము :- మీకు తోసదు. నాను శెప్తే యినరు.

శివ:-మనలోమనమాట మరొకటిచెప్పు తప్పకుండావింటాను.

రాము:- వింటారా ?

శివ:- ఆఁ వింటాను.

రాము:- అయితే యెట్టాగొట్టా యింట్లోనుంచి యెల్లిపోండి.

శివ:- ఆఁ! (ఆశ్చర్యంగా చూస్తాడు)

రాము:- ఆ! మరి యినండి. యెక్కడన్నా పొట్టోసుకుంటూ
వుండండి. తరవాతసంగతి నేను శెప్తాను.

శివ:- యేమిటది ?

రాము:- ఇప్పుడే యెట్టా శెప్తాను? అమ్మగారు యింటికి రాగానే యేదోయిదంగా గొడవసేసి యిల్లొగ్గే శెయ్యండి. మిగిలినయవ్వారం సానుకూలం శేయటానికి నేనుండాను.

సావి:- రాముడూ! (బయటనుంచి పిలుస్తుంది)

రాము:- ఆ! వత్తుండానమ్మగారూ! (వెళ్ళబోతాడు)

సావి:- (ప్రవేశించి) బండీలోసామాన్లు యింట్లోకితీసుకురా.

రాము:- సిత్తం. (బయటకు వెళ్తాడు)

సావి:- (శివపాదాన్ని విసుగ్గాచూస్తూ యింట్లోకిపోతుంది)

శివ:- (భయం అభినయిస్తూ ప్రక్కకు తప్పుకుంటాడు)

రాము:- (రెండు అట్టపెట్టెలతో బయటనుంచి ప్రవేశించి లోపలకు వెళ్తాడు)

శివ:- (విచారంగా) ఆరిభగవంతుడా! మనలోమనమాట నన్నెల్లా శృంష్టించావురా? యింత భయస్తుణ్ణయితే నేనెలా యింక బ్రతికేది? తనకోసంకాకపోయినా లోకులు చెప్పుకోటానికైనా నాతో మాట్లాడదేమిటి ఖర్మం? మనలోమనమాట దానికళ్ళకి నేనొకమృగంలా కనిపిస్తున్నానేమో! (సిగరెటుముట్టించి నీరసంగా సోఫాలో వాలిపోతాడు)

రాము:- (లోపలనుంచివచ్చి) దొరా! యదవని నాను పోతుండాను. నాను శెప్పినట్టు శేసి యిల్లొగ్గేసి మాయింటికి రండి. అన్నియిసయాలూ అక్కడ మాట్లాడుకుందాం. యేం? నానెల్తున్నా. (బయటకు వెళ్తాడు)

సావి:- (ప్రవేశించి శివపాదాన్ని విసుగ్గాచూస్తూ) అస్తమా నం యింట్లోవుండకపోతే కాసేపు అలా బజార్లోకిపోరాదూ? మగవాడివికాదూ ?

శివ:- నామగతనం మన్నయినట్లేవుంది. (లేనిధైర్యం తెచ్చు కుంటూ) నేనే సరైనమగవాణ్ణయితే నీ ఆటలీవిధంగా సాగేవేనా? యింతకాలంనుంచీ ఆడదానిలాగా నీఆటలన్నీ గమనిస్తూ తటస్థంగా వూరుకున్నాను. ఇంక వక్క క్షణం నీఆటలు సాగనీయను.

సావి:- ఆఁ ! (హేళనగా) యీవేళ నీధోరణి చాలావింతగా వుందే.

శివ:- మనలోమనమాట పెళ్ళయినప్పటినుంచి నీధోరణి నీప్రవర్తన వేరుగావున్నాయ్. నిన్ను చూస్తున్నకొద్దీ నా ధోరణి వింతగామారింది.

సావి:- (నవ్వి) చాలాదాకావుందే వ్యవహారం.

శివ:- యెందుకుండదు ? ఇకమీద నిన్నుబట్టే నాప్రవర్తన మారుతూవుంటుంది. సావిత్రీ ! నీప్రవర్తన యెంతవరకు న్యాయమయిందో ఇప్పటికైనా ఆలోచించావా ?

సావి:- ఆ అవసరం ఇంతవరకూ కలగలేదు.

శివ:- కట్టుకున్న భర్తని కాలతన్ని నీయిష్టంవచ్చినట్లల్లా ఆడటం మంచిదికాదు.

సావి:- నీసలహా విన్నాను. కాని ఆచరించటమూ లేకపోవ
డమూ అనేది నామీద ఆధారపడుతుంది. ఇంకేమన్నా
వున్నాయ్యా?

శివ:- ఉన్నాయ్. నిన్ను గురించి, మన దాంపత్యాన్ని గురించి
ఎందరు యేవిధంగా చెప్పుకుంటున్నారో వినిపిస్తున్నాయా?

సావి:- లేదే! యేంచెప్పుకుంటున్నారు?

శివ:- వినవలసిన అవసరం నీకెందుకుంటుంది? పదిమందిలో
తిరిగేవాణ్ణికనుక ఆ అవసరం నాకుంటుంది.

సావి:- ఇంతకీ యేమంటావ్?

శివ:- నీ ప్రవర్తన సరిదిద్దుకుంటే నేనీ ఇంట్లోవుంటా.

సావి:- వుండమని బ్రతిమిలాడిందెవరు? నా ప్రవర్తన యెప్పు
డూ వొకేమాదిగావుంది. ఇప్పుడు నీకు కొత్తగాకనిపి
స్తోందా? పాపం ఇంతకాలంనుంచీ లేని అభిమానం యీ వేళ
వచ్చిందా? (నవ్వి) దయవుంచి ఇంకెప్పుడూ ఇలాంటి
మాటలు నాదగ్గర యెత్తకు.

శివ:- సరె రానియ్ యీ మాటలు వాణ్ణే అడుగుతాను.

సావి- యెవర్ని?

శివ:- నీ రంకుమగడు సూరయ్యని.

సావి:- ఆఁ! వ్యవహారం చాలానరకూవచ్చిందే! యెవరితో
మాట్లాడుతున్నావో, యేంమాట్లాడుతున్నావో ఆలోచిం
చుకు మరీమాట్లాడు.

శివ:- నువ్వాలోచించే యీవిధంగా నాటకమాడుతున్నావా?

సావి:- అది అనవసరం. 'దొంగలుపడ్డ ఆరునెలలకి కుక్కలు మొరిగాయిట' ఇదివరకు యెన్నడూలేంది యీ వేళంత రోషం యెక్కడ్నుంచివచ్చింది? శివపాదం! వొక్కటే మాటచెప్తున్నాను.దయవుంచి నావిషయంలోఇంకెప్పుడూ జోక్యం కలిగించుకోకు. యీ యిల్లు నాది. నాయింటికి వచ్చే సూరయ్యగార్ని రావద్దంటానికి నీకేవిధంగానూ హక్కులేదు.

శివ:- అలాగా! నీమెడలో ఆ మెుకు యేనాడైతే కట్టానో ఆనాటినుంచీ నీ జీవితాంతంవరకూ, నీమీద నాకు సర్వ హక్కులూవున్నాయ్. పదిమంది పెద్దల్లో కట్టిన పుస్తెని కాదనటానికి నీకు కాదుగదా, నిన్ను సృష్టించిన బ్రహ్మ తరంకూడాకాదు. నీకునువ్వే పెద్దవని పొంగిపోకు. నీచుట్టూవున్న సంఘం, కులం, మతం, ఆచారం అనేవి మాసిపోలేదని, యెటువంటివాళ్ళయినా వాటికి తల వంచాలని గ్రహించు. రోజురోజూ నీఅత్యాచారాలు మితి మీరుతున్నాయి. నీతప్పు నువ్వేదిద్దుకుంటావని వుపేక్షిం చాను.రోజురోజుకీ నీదుష్ప్రవర్తన ప్రబలమైంది. పరువు కోసంప్రాకులాడే నాగుండెల్లో గునపమై గుచ్చుకుంటోంది. (పెద్దగా)యీసారి ఆసూరయ్యగుమ్మంలో కాలుపెట్టాడా!

సూరయ్య:- (ప్రవేశించి ప్రక్కకు తప్పుకుంటాడు.)

సావి:- ఏంచేస్తావ్ ?

శివ:- యేంచేస్తానో చూపిస్తాను.

సావి:- (సూరయ్యనిచూసి) రండి!

సూర:- (వస్తూవుంటాడు.)

శివ:- (సూరయ్యనిచూస్తూ) ఆగు...ఎందుకొచ్చావ్ ?

సూర:- యెందుకు రాకూడదు ?

శివ:- మనలోమనమాట యెందుకో తెలియదేం? నాకాపురం కూలద్రోసినందుకు. ఆలీమగలమధ్య అనురాగాన్ని రూపుమాపి, అవాంతరాలు లేవతీసి ఆనందాన్ని అనుభవిస్తున్నందుకు.

సూర:- ఓహ్హో! అందుకా అర్థమైంది. యింతకీ నువు చెప్ప దల్చుకుంది...

శివ:- యీనిముషంనుంచీ నాగుమ్మంలో కాలుపెట్టద్దని.

సావి:- (పెద్దగా) శివపాదం!

శివ:- (నవ్వి) మనలోమనమాట మనస్సుకి కష్టంకలిగిందా? మాటవినకపోతే వాణ్ణీ నిన్నూ...

సూర:- నోర్ముయ్! నువ్వూ వకమనిషివే! నీదీ వకజన్మే! సిగ్గులేక యింకా మాట్లాడుతున్నావా? దీనికంతకు కారకుడవు నువ్వేనని యిప్పటికైనా గ్రహించు. సంసారం సరిదిద్దుకోలేని సన్యాసులంతా ఇలాగే మాట్లాడుతూవుంటారు. చేతనైతే భార్యను అదుపులోపెట్టుకోవాలి. అసమర్థుడవైతే కుక్కినపేనులాగా పడుండు. మంచిచెడ్డలు తెలియకుండా యింటికివచ్చిన నాలాంటి పెద్దమనిషిని

ధిక్కరిస్తే నీకు అపనిందే ఆధారమవుతుంది. నిన్ను అసమర్థుడని అంటాను.

శివ:- అనండి! యిద్దరూకలిసి అనండి!! ఆ అసమర్థితనల్లేగా కాపరం యింతవరకు తెచ్చుకున్నా. ఇప్పుడు అందులో వున్న చెడ్డని గ్రహించాను. బాధపడుతున్నాను. నాబాధ నీదాకావస్తేనేకాని నీకు తెలియదు.

సూరి:- అంటే ?

శివ:- నీకళ్ళయెదుట నీభార్య పరాయిమగవాడితో...

సూరి:- ఛటప్! (చెంపమీద కొడ్తాడు)

శివ:- (చెంప సవరించుకుంటూ) నీకు మాటంటేనే అంత పౌరుషంవచ్చిందే నీవు చేస్తున్న అఘాయిత్యానికి నాకెంతపౌరుషంరావాలి? అందరూ నీలాంటివాళ్లనే అనుకోవాలి...(విచారంగా) మనలోమనమాట యిప్పుడు విచారిస్తే యేంప్రయోజనముంది? (సూరయ్య సోఫాలో కూర్చుంటాడు)

సావి:- ఆమాట గుర్తుంచుకొని నోరుమూసుకొనిపడుండు.

శివ:- (సావిత్రిని కోపంగాచూసి) వొకవరలో రెండుకత్తులిమడవు. ఇందులో నీతప్పేమీలేదు. యీసళిస్తున్నా యింట్లో పడుండటం నాతప్పు. ఆ అలుసుతోనే నన్ను కొట్టాడు. యీఇల్లు నాకు స్మశానంగా కనిపిస్తోంది. యిక్కడ వక్కక్షణం వుండకూడదు. కాని మనలోమన మాట యీరోజుస నన్నుకొట్టిన చెంపదెబ్బ గుర్తుంచు

కోండి. నాపట్ల చేస్తున్న అన్యాయానికి యింతకింత అనుభవించకపోరు. (సూరయ్యతో) కట్టుకున్న భర్తనే కాలితోతన్నిన యీసావిత్రికి నీవు శాశ్వతంకాదు.

సావి:- (ఈర్ష్యగా) కట్టుకున్నభర్త ... పదిమందిలో కట్టిన తాలిబొట్టు (మంగళసూత్రం తెంపి) దీనితో నాపీడ వదిలి పోయింది. నీకు నాకూ యేవిధంగానూ సమంధం లేదు. ఇదిగో...నీవుకట్టిన మోకుని నువ్వేతీసుకో... వెళ్లు... నాయింట్లోనుంచి వెళ్ళిపో. (సూత్రం శివపాదంమీద విసురుతుంది) మళ్ళీ నాగుమ్మంలో కాలెట్టకు (పెద్దగా) వెళ్ళు.

శివ:- వెళుతున్నాను. అదుపులేని ఆడదానితో కాపురంచేసే కంటె ఇదే వుత్తమమైనపని. నడివీధిలోపడి పరువునుపాడు చేసుకునేకంటే ఆనందంగా అవతలికి పోవటమే మంచిపని. తెలిసో తెలియకో ఇంతవరకూ వున్నాను...ఇంక వుండ లేను. (సూరయ్యని, సావిత్రిని కోపంగా వొకసారిచూసి చరచరా బయటికి వెళ్తాడు)

సూర:- (సిగరెటు కాలుస్తూ ఆలోచిస్తూవుంటాడు)

సావి:- (సూరయ్యని సమీపించి) యేం? అలావున్నారు? శివపాదం మాటలు వింతగావున్నాయా?

సూర:- వెర్రివాణ్ణిచేస్తున్నాయ్.

సావి:- (పకపకనవ్వుతూ?) ఇంక ఆమాట మర్చిపోండి. ఇకముందు మనం యేఅడ్డంకూలేకుండా స్వేచ్ఛగావుందాం సరేనా?

సూర:- అందుకేగా కొనుక్కొన్నాను.

సావి:- కారా ? (ఆశ్చర్యంగా) డబ్బు లేదన్నారుగా ?

సూర:- అని వ్రాసుకుంటానా? వున్నయిల్లుఅమ్మి, బ్యాంకిలో యకౌంటు పూర్తిగా యెత్తేశాను. అదీయిదికలిపి మనం హాయిగా విహరిస్తానికి కారు, కావలసిన పెట్రోలు కొన్నాను.

సావి:- అయితే యింక మిగిలిందేమిటి ?

సూర:- నువ్వు తెంపిపారేసిన తాలిబొట్టు నాపెళ్లాంమెళ్లోను మిగిలింది.

సావి:- అంతేనా ? యింకేమీ లేదూ ?

సూర:- నీకు తెలియకుండా యింకెక్కడదాచాను ? నాకు మిగిలిందల్లా నువ్వే. నీ అందమే. నీ సంతోషమే.

సావి:- మరి రెండిళ్ళూ యెలాగడుపుతారు ?

సూర:- ఆయింటిసంగతి మనకెందుకు ? మనిల్లు మనం గడుపుకుందాం.

సావి:- మరి మీ భార్యగతి ?

సూర:- అధోగతే.

సావి:- అంటే వప్పుతుందా ?

సూర:- ఏమిటి ?

సావి:- సంఘం.

సూర:- సంఘం వప్పుదలతో మనకిపనేముంది? సంఘంఅనేది మనచేతిలో కీలుబొమ్మ. మనం యెలాఆడిస్తే అలా ఆడుతుంది.

సావి:- (సూరయ్య ముక్కు-పట్టుకొని) అలాగేం ?

సూర:- 'ఊఁ'– (దగ్గరకుతీసుకొని ముద్దుపెట్టుకోబోతాడు)

సావి:- (తప్పించుకుని హుషారుగా నృత్యంచేస్తూ పాడుతుంది)

నారాజ! నన్నేలే మహరాజ,
వరాలరాజ నగలుమాని రావోయ్ ॥నారా॥

నాఅందచందములు నీకాళ్ళకిబంధం
నాఅందాలరాజా నన్నేలెమహరాజ
కళకళ్లాడే నాయవ్వనము నీది
యేలుకోరాద ? జాగేల నీకింక ॥నారా॥

మనవలపె వెన్నెలతోట, ప్రేమపాట
ఆనందంగా విహరింతాము లేవోయి
అదే ప్రేమలోకం అందుకె వలపుతోట
అదిగో చూడరాదా ? లేచిరావోయ్ ॥నారా॥

చల్లగాలిలో విహరించెదమోయ్
అలసటచెందక ఆనందముగను
పోయెదమోయ్ ఫోర్డుకారుమీద రావోయ్ ॥నారా॥

(అనంతరం సూరయ్య వడిలో సావిత్రి వాలిపోతుంది. బయటనుంచి మోహనరావు ప్రవేశించి యీర్ష్యగా వాళ్ళనిచూసి సకిలిస్తాడు. సావిత్రీ సూరయ్యాలు విడిపో

తారు. సూరయ్య విసుగుదలతో మోహనరావుని చూస్తాడు)

సూర:- (నెమ్మదిగా) మోహన్ !

మోహ:- అవును. మోహన్ రావ్ నే.

సూర:- మళ్ళీ యెందుకొచ్చావ్ ?

మోహ:- శారద కాపరం సరిదిద్దటానికి.

సావి:- (నిట్టూర్చి అక్కడున్న కుర్చీలో కూర్చుంటుంది) అయితే ఇక్కడికి రావటం దేనికి?

మోహ:- (కోపంగా) యెందుకో నీకు తెలియదూ? మళ్ళీ నాద్వారా వివాలని సిగ్గువిడిచి అడుగుతున్నావా ?

సావి:- మాటలు తిన్నగా రానియ్యండి. సూరయ్యగారి బావ మరిదని...

మోహ:- కనికరించి విడిచిపెడుతున్నావా? వంచకీ! నువ్వు సానివా సంసారివా? మానాభిమానాలు మంటకలిపి, ఫ్రొక అమాయకురాలి సుఖానికి అడ్డుతగిలి, అయిదేళ్ళ నుంచి ఆమెభర్తని వల్లో వేసుకున్నావ్. సూరయ్యని వంచించి, ఆయన ఆస్తిని అపహరించి, ఆఖరికి పడుంటానికి పంచకూడా లేకుండా పాడుచేశావ్. నిన్నేంచేస్తే పాప ముంది ?

సూర:- (పెద్దగా) మోహన్ రావ్ ! అనవసర ప్రస్తావనతో ఇక్కడ పనిలేదు. నా ఆస్తినిగురించి తర్కించటానికి యెవ్వరికీ యేవిధంగానూ హక్కులేదు. నా భార్యని,

పిల్లణ్ణి నాయిష్టంవచ్చినట్లుచేస్తాను. 'కలవకాలేసి దుంప కత్తిపీటకి వచ్చిందిట' ఆవిషయాల్లో నాకు లేనిచింత నీకెం దుకు ? నా కుటుంబవిషయాల్లో జోక్యంకలగచేసుకోనక్కర్లే యెన్నోసార్లుచెప్పాను. 'పౌరుషంకల పురుషుడవైతే సిగ్గుంటుంది.

మోహ:- (పెద్దగా) శావా! మాట పొల్లురానిచ్చావంటే మర్యాదదక్కదు. 'పసువుచచ్చినా పౌరుషంచావలా' నీతికలవాడివైతేమాట ల్తోపనిలేదు. కట్టుకున్న భార్యకంటే యీ కామపిశాచి నీకు యెక్కువకాదు.

సావి:- (సూరయ్యతో) చూశారా ? యేవిధంగా పేలుతు న్నాడో. కామపిశాచినట.

మోహ:- అంతకంటే అన్యాయంగా జీవిస్తున్నావు. లోకం కోసం పెళ్లాడి భర్తని అమాయకుణ్ణిచేసి, అతనికళ్ళుకప్పి నీయిష్టమొచ్చినట్లల్లా ఆడుతున్నావు. నీసుఖంకోసం సూర య్యని యంత్రంగా వుపయోగించుకొని, వీధికిలాగి వెర్రి కుక్కని చేస్తున్నావు. నీదీవకజన్మే. నీవూవొకపతివ్రతవే.

సూర:- నోర్ముయ్. సావిత్రితోమాట్లాట్టానికి నీకేవిధంగానూ సంమంధంలేదు. నీవు యేదిమాట్లాడినా నాతోనే మాట్లా డాలి.

సావి:- (కోపంతో) మీరిద్దరూ వెళ్ళి వీధిలోమాట్లాడుకోండి. నాయింట్లో మాట్లాడటానికి యెంతమాత్రం వీలుపడదు.

సూర:- కాస్సేపు నువ్వూర్కో సావిత్రీ! నేను వాణ్ణి అవతలకి పంపుతానుగా. నాకోసమన్నా నువ్వూరుకో.

సావి:- ఆపనేదో తొందరగాచెయ్యండి. (విసుగుగా లోపలికి వెళ్తుంది)

సూర:- మోహన్! వెంటనే నువ్విక్కణ్ణుంచి వెళ్లిపోవాలి.

మోహ:- (విచారంగా) బావా! నామాటవినవూ? నీభార్యా పిల్లాడూ, నీకోసం కంటికి, మంటికీ యేకధారగా యేడుస్తున్నారు. తిండికిలేక నల్లులుమాడినట్లు మాడిపోతున్నారు. వాళ్ళ శోకాగ్ని చల్లార్చటం నావశంకాకుండా వుంది. నువ్వు కంటికికనిపిస్తేనేకాని బ్రతికేటట్లులేరు.

సూర:- చావనియ్. పీడవదిలిపోతుంది.

మోహ:- కన్నకొడుకు, కట్టుకున్నపెళ్లాం నీకు పీడగా కనిపిస్తున్నారా? బావా! యిది ధర్మమేనా? యీ సావిత్రి కొంపలో సరసాలాడటమేనా నీకు కావలసింది? వొక్కసారి వెనక్కితిరిగిచూడు. నీ సిరి, సంపద, యీరోజున కర్పూరంలాగా యెందుకు కరిగిపోయిందో వూహించు. దీనికంతకీ కారకులెవరో ఆలోచించు.

సూర:- ఆలోచించాను. బాగాఆలోచించాను.

మోహ:- ఆలోచించే యీవిధంగా ప్రవర్తిస్తున్నావా?

సూర:- అవును. అందుకు వేరుగా నువ్వు నువ్వు బాధపడక్కర్లేదు. 'యింట్లో యీగలమోత బయట పల్లకీలమోత' అన్నట్లు ముందు నీసంగతి ఆలోచించు. నీభార్యా పుట్టింటోవుండి

రానుపొమ్మంటే నువ్వేంచేశావు? నీమామగారు యిల్లరికంవుండమంటే నువ్వెందుకు అంగీకరించలా? నీసుఖం నీభార్యకి, నీభార్యసుఖం నీకు అవసరంలేదేం? పిచ్చివాడా (నవ్వి) నీసంసారం సక్రమమైన పంథాలో నడుపుకోవడం చేతకాలేదుకాని చెల్లమ్మ కాపరం కుదటపడెయ్యాలని ప్రయత్నిస్తున్నావా? (నవ్వి) మాట్లాడవేం?

మోహ:- (తలవంచుకుంటాడు)

సూర:- ఆ నీతులన్నీ నీపట్ల పనికిరాకపోయాయా? యిప్పుడన్నా తెలుసుకో. ముందు నీతప్పు సరిదిద్దుకొని యెదటవాడితప్పు దిద్దటానికి ప్రయత్నంచెయ్. వెళ్ళు...

మోహ:- ఒక్కసారి యింటికి...

సూర:- రావాలనిలేదు. నీవు కోరావుకాబట్టి రావటానికి ప్రయత్నిస్తాను. వెళ్ళు ... కాని, యీమాటమాత్రం గుర్తుంచుకో. యీసారి యిక్కడికివచ్చావంటే మాటల్తో వెళ్ళవనిమాత్రం మనస్సులోవుంచుకో. (చరచరా లోపలకు వెళ్తాడు)

మోహ:- నిట్టూరుస్తూ) సరె. యింకా యెంతకాలం యిల్లా సాగిస్తారో చూస్తాను. నా శారదసుఖంకంటే యీ సాని దానిసుఖంతో నాకు పనిలేదు. అంతుతేల్చుకుతీరుతాను. (చరచరా బయటకువెళ్తాడు)

— తెర —

## 2వ రంగము

( స్థలం : బజార్. మోహన్‌రావ్ పత్రికచూస్తూ రోడ్డుప్రక్కగా నిలబడివుంటాడు. శివపాదం యెదురుగా ప్రవేశిస్తాడు )

శివ:- గుడ్ మార్నింగ్ మోహన్‌రావుగారూ!

మోహ:- (చూసి) ఓ! గుడ్ మోణింగ్. యింట్లోనుంచి వెళ్ళిపోయారటగా? ఎక్కడుంటున్నారు?

శివ:- కొత్తపేటలో.

మోహ:- యేదన్నా వుద్యోగంచేస్తున్నారా?

శివ:- మనలోమనమాట యేదీ చెయ్యకపోతే యెల్లా చెప్పండి. పొట్టకోసం యేదోవిధంగా తిప్పలుపడాల్సిందేగా.

మోహ:- ఆ ఆలోచన యిదివరకేవుంటే, బాగుపడేవాడివి. ఆడదాని సంపాదనమీద ఆధారపడి నిరాధారంగావుంటే యిలాగే పరిణమిస్తుంది. శివపాదం! ఇప్పటికైనా కళ్ళు తెరిచారు అదే సంతోషం. యింతకీ మీరేం వుద్యోగం చేస్తున్నారు?

శివ:- మనలోమనమాట స్వయంగా నాటకసమాజం వోపెన్ చేశాను. ప్రపంచంలో జరుగుతున్న అత్యాచారాలు, వ్యక్తుల వెర్రిచేష్టలు, అమాయకుల అప్రయోజకత్వం ప్రజలకు నాటకప్రదర్శనాలుద్వారా తెలియపర్చి వ్యాపిం

చిన కుళ్ళుని కనిపించకుండా కడగాలని ప్రతినప్పూని ప్రయత్నంచేస్తున్నాను.

మోహ:- మంచిపనిచేస్తున్నారు! యిందాకాబయల్దేరారు? సావిత్రిని చూట్టానికేనా?

శివ:- రామరామ! ఆ ప్పుద్దేశ్యం ఇంతవరకూ కలగలేదు. ఇకముందు కలుగదు. మనలోమనమాట దాని హాజం అణవాలని నేనుచూస్తూవుంటే మళ్ళీ చేతకానిచవటలాగా ఆ మాయలమారియింటికి పోతానా? యింకెప్పుడు అలా అనకండి మోహనరావుగారు.

మోహ:- ఆమాటమీద నిలబడితే ఆనందమే.

శివ:- (సకిలించి) చూస్తారుగా! మరో చిన్నకోరిక.

మోహ:- ఏమిటి?

శివ:- (అమాయకంగానవ్వి) మేము రేపు ఆరోతేదీన హనుమంతరాయ గ్రంథాలయహాల్లో నాటకంఏర్పాటుచేశాం.

మోహ:- ఏం నాటకం?

శివ:- 'అదుపులేని ఆడది'

మోహ:- ఎవరు వ్రాసింది?

శివ:- మనలోమనమాట రచన, దర్శకత్వం, నిర్మాత, మేనేజరు, ఆర్గనైజరు, యాక్టర్, స్వీపరు అన్నీ (వెకిలిగానవ్వి) నేనే.

మోహ:- ఎవర్నిగురించి వ్రాశారు?

శివ:- ఆడదాన్నిగురించీ.

మోహ:- మీ పెళ్ళాన్ని గురించేనా?

శివ:- మోహనరావుగారూ! మళ్ళీ ఆమాటనకండి. సూత్రం తెంపివారేసినది నాపెళ్ళామేమిటి? నేను దానిమొగుణ్ణేమిటి? ఆసమయంతో ఆజీవితం ఆరోజుతో నేసరి కాని మిగిలిందల్లా వక్కటే.

మోహ:- ఏమిటది?

శివ:- (అటు ఇటూచూసి) పగసాధించటం.

మోహ:- ఎవరిమీద?

శివ:- మనలోమనమాట ఆ బొంకు నేర్చిన రంకుదానిమీద.

మోహ:- ఆ పనిమీవల్లవుతుందా?

శివ:- అయింతర్వాత మీరే వింటారుగా.

మోహ:- సరె కానియ్యండి. అదీచూస్తాను.

శివ:- **మీకేమీ** బాధలేదంటే **మీ**బావ సూరయ్యకి...

మోహ:- బుద్ధివచ్చేట్లు చేయండి ఆనందిస్తాను.

శివ:- ఆమాత్రము అంగీకరించారు అంతేచాలు.

మోహ:- (రిస్టువాచిచూచి) ఆఫీసుకిటయమయింది వెళ్లొస్తాను.

శివ:- మాటల్లోపడి అసలుపనే మర్చిపోయాను. చూడండీ మీరుమాకు మాసమాజానికి ఒకచిన్న సహాయంచేయాలి.

మోహ:- (ఆశ్చర్యంగా) నేనా? ఏమిటది?

శివ:- (కరపత్రం అందిస్తూ) ఆరో తేదీన ప్రదర్శించేనాటకం కేవలం వొకబీదయువకుని వివాహసహాయార్థం ప్రదర్శి

స్తున్నాం - మీరు ఫస్టుక్లాసు టికెట్టు తీసుకోవాలి. మీ ఆఫీసులో మీ ఫ్రెండ్సు అందరికీ అభిమానంతో టికెట్లు అంటకట్టాలి. పేపరుచూడండి అన్నీ మీకే తెలుస్తాయి.

మోహ:- (పేపరుచూస్తూ) యీ నాటకమునకువచ్చు ఆదాయము ఒక పేదవాని వివాహసహాయార్థం వినియోగించబడును.

శివ:- (నవ్వి) మనలోమనమాట అందుకే తమలాటి పెద్దలంతా మాకు తగినసహాయం చేయాలని కోరుతున్నాం.

మోహ:- (నవ్వి) టిక్కెట్టు తీసుకున్నా లేకపోయినా మీ వెనకాల మాత్రం బయల్దేరుతాను.

శివ:- రండి. రండి. మనలోమనమాట యేదో మాకు సాయంగానన్నా వుంటారు.

మోహ:- ఎందుకో తెలుసా? పొరపాటున యెవరన్నా టిక్కెట్టుకొంటే, 'వద్దు' అనిచెప్పటానికి.

శివ:- (ఆశ్చర్యంగా) అదేమిటండోయ్ మనలోమనమాట మీకు నామాటల్లో నమ్మకం కలగటల్లేదా?

మోహ:- యెందుకుకలగటల్లా? కాని ఆపనినాకిష్టంలేదు.

శివ:- మనలోమనమాట యేపని? నాటకాలాడటమా? యితరులకు సహాయంచేయటమా?

మోహ:- సహాయంచేయటం.

శివ:- మీలాంటివాళ్లు బీదవాళ్లమీద చిన్నచూపుచూట్టం.

మోహ:- కాకపోతే బీదవాడికి పెళ్లీ, పెళ్లాం ఎందుకండి ?
తిండికేలేక వాడేయేడుస్తుంటే, దానికేం పెడతాడు ?

శివ:- అలాఅనకండి 'నూరుబద్దాలాడినా ఒకపెళ్లి చెయ్య మన్నారు పెద్దలు'

మోహ:- వాళ్లుచెప్పినవిధంగా మనంచేస్తున్నాం. అదిచాలా తప్పు. పెళ్లయ్యాకచూడు ఆదాంపత్యం యెలావుంటుందో.

శివ:- మనలోమనమాట యెలావుండటమేమిటి ? కులాసాగా చిలకా గోరువంకల్లాగ కాపరంచేస్తూ కాలంగడుపుతారు.

మోహ:- అని మనం అనుకుంటాము. హాయిగాఅలాకాలంగడ పకుండా నీకు నీ భార్యకీమధ్య యీ యెడబాటు యెందు కొచ్చింది ?

శివ:- గ్రహపాటుకొద్దీవచ్చింది. మనలోమనమాట అందరికీ నాపోలికే కావాలీ ?

మోహ:- అనుభవించే వాళ్లకికాని అందులోరుచి తెలియదు. పూట కూటికిలేక, సంసారం యీదలేక దాన్నికట్టుకున్నం దుకు వాడు, వాడ్నికట్టుకున్నందుకది కుళ్ళికుళ్ళి యేడవటం తప్ప వేరేయేమన్నావుందా? బాధలుపడ్లేక ఆదంపుతుల్లో యేవొక్కరో నూతికోగోతికో ప్రాణాలు అర్పితం చేయటం. లేదా అనాచారాలకి తలవంచటం. అవు నంటారా ? కాదంటారా ?

శివ:- మనలోమనమాట యేదీఅన్నా,మీారుచెప్పిందీ యదా ర్థమే మనలోమనమాట ఆమాటనుకొని పెళ్లిళ్లు మానేస్తే లోకశృష్టెంకావాలి ?

మోహ:- మా నియ్యాలన్నా, వొకబీదరాలు వివాహానికి వినియోగించండి మంచివాడూ, బుద్ధిమంతుడు అయిన ధని కునికి బీదరాల్నిచ్చి పెళ్లి చెయ్యండి. లేదా పేదలకు అన్న దానం చేయండి.

శివ:- అయితే బీదకుర్రాళ్ల గతి ?

మోహ:- కష్టపడిచదివి పొట్ట కూటికి పదిరూపాయలు సంపా దించుకున్న రోజున వాళ్లే చేసుకుంటారు.

శివ:- అదీ మంచిపనే. యికమీద అలానే చేద్దాం. ప్రస్తుతానికి అనుకున్న ప్రకారం యీ పెండ్లి చేద్దాం.

మోహ - యింకా ఆమాటమీద నేవున్నారా? దానికినామనస్సు అంగీకరించదు. వొక్కరాగికానీ సహాయం చేయను.

శివ:- మనలోమనమాట (నిరసంగా) అంతేనంటారా ?

మోహ:- (ఔను అన్నట్లుతలవూపుతాడు.)

శివ:- సరె. మీయిష్టం.

మోహ:- (రిష్టువాచిచూసి) వస్తాను. (నిష్క్రమిస్తాడు)

శివ:- యేమిటో ! యీ విషయంలో యెక్కడికిపోయినా పొద్దెదురౌతుంది. మనలోమనమాట అసలాకుర్రాడికి పెళ్లియోగీత లేదేమో! (సిగరెటు ముట్టిస్తూవుండగా రాముడు యెదురౌతాడు) యేరా రాముడూ ? యంత వరకొచ్చింది మనపద్మవ్యూహం ?

రాము:- సగమయింది దొరా.

శివ:- మనలోమనమాట సగం అంటే యింకెన్ని రోజులు వోపిక పట్టాలిరా ?

రాము:- తొందరపడతారేం దొరా ?

శివ:- యేంచెయ్యనురా ? నాకు సావిత్రికి యేలగ్నాన పెళ్లయిందోకాని దాన్నిచూడకుండా అసలే వుండలేనురా. మనలోమనమాట యింటికిపోతే యిరుగుపొరుగంతా యిసళిస్తుందని, సావిత్రి యింకాచులకనగాచూస్తుందని భయం. మనలోమనమాట మనస్సు విప్పుకుందామాంటే తినేఅన్నంలోను, త్రాగేనీరులోనూ, కూడా ఆ జగన్మోహన సుందరే కనిపిస్తోంది- దాంతో కాపరంచేసినా లేకపోయినా దాన్ని కంటితో అప్పుడప్పుడు చూస్తుంటేచాలు కడుపునిండిపోతుంది.

రాము:- అయితే దానికింతపయత్నం యెందుకు ? యదవని నా మాటినీ, రోజు సాయింత్రపేల కిష్టఆనకట్టకాడకెల్లండి ఆయమ్మ కారులో సికారుకొత్తూవుంటాది. (నవ్వి) శివ పాదంగోరు ! నానొకటేమాట శెప్తుండాను. ఆయమ్మమీద మమకారం తగ్గించుకుంటేనే కాపరం కుదటపడుద్ది. నేకపోతేయింతే. పైగా మద్యపనిసేసే నాలాటోళ్లంతా యదవలై కూసుంటారు.

శివ:- మనలోమనమాట అదేమిట్రా అంతమాటనుకున్నావు. నీమాటకాదని యేపనన్నా చేస్తున్నానా? నావాడివికాబట్టి చూడాలనిపిస్తోందని నీతో చెప్పుకున్నాను. అంతే.

రాము:- యదవని నామాటయుందే మీరు లచ్చముంచుతే మీరు ఆయమ్మని సమయం సిక్కేదాకా, సానుకూలపడేదాకా, నాను శెప్పేదాకా సూత్తానికే యీల్లేదంట. ఆ

సూరయ్యగోడంటే యిరక్తిపుట్టి రోజూ యింటికి రావద్ద నేస్తోంది. సమయం దొరికినప్పుడల్లా ఆడిమీద నాను వున్నదీ లేనిదీ కల్పించి శెప్పేస్తుండేను. మనసుపూర్తిగా యిరిగిపోయింది. యిరిగిన యినపముక్కన్నా అతుకుద్ది కాని మనస్సు అతుకుద్దా? యియ్యాలో రేపో యింటి కొత్తే గెంటేతుందికూడా. అప్పుడు సూద్దాం.

శివ:- (ఆలోచించి) ఆఁ! మంచివుపాయం దొరికింది. సావిత్రికి సినిమాయాక్టర్ కావాలని చిన్నప్పట్నుంచి అభిలాషగా వుంది. అందుకని (రాముడుచెవిలో చెప్తాడు)

రాము:- (ఆలోచించి) సరె కానియ్యండి. అట్లాగే సేద్దాం... సాలాజాగ్రత్తగా యవ్వారం నడపాలి. నేకపోతే కద అడ్డంతిరుగుద్ది.

శివ:- మనలోమనమాట...

రాము:-ఆమా టేమా నెయ్యాలి. లేదాకొంపలంటుకుంటాయ్.

శివ:- సరె. యీసంగతి మళ్లీ యెప్పుడుచెప్తావు?

రాము:- రేపీనూాలకిచెప్తాను. వత్తా. (వెళ్లిపోతాడు)

శివ:- (నిట్టూరుస్తూ) యేమిటో! దేశంలో యింతమంది జనాభావుంటే మనలోమనమాట యిన్నికష్టాలూ నాకే రావాలీ? (సిగరెట్టుముట్టించి వెళ్తాడు. వెంటనే మధ్యతెర యెత్తమడుతుంది. పూరిపాకలో శారద వుత్సాహంగా పాడుతూ వుంటుంది.)

ఓ.........

సంతోషమే మదికానందమె

ఎరుగుదేరు నూరెంతో హాయ్ ॥సంతో॥

దయకలిగె నేడు నా పతికి నాపైన
సయ్యాటలాడంగ సమయంచిక్కింది
మదిలో రేగిన మమతలన్ని
వదలిపోవునో మాసిపోవునో ॥సంతో॥

బాబు:- (బడినుంచి నిరుత్సాహంగా ప్రవేశిస్తాడు)

శార:- (బాబునిచూసి వుత్సాహంగా యెదురెళ్లి)

బాబూ.........

వస్తున్నారట మీ నాన్నగారూ
వస్తులతో యిక పనిలేదుకద
యెడబాటులేదు మనకికముందు
ఆడుచు పాడుచు హాయిగవుందాం ॥సంతో॥

బాబూ! మీనాన్నగారు యివ్వాళ తప్పకుండా వస్తానన్నారట.

బాబు:- (సంతోషంగా) యెవరు చెప్పారమ్మా!

శార:- మామయ్యకి కనిపించారట. మాట్లాడాలంటే యింటికి వచ్చి మాట్లాడతానన్నారట ?

బాబు:- ఎప్పుడమ్మా?

శార:- నిన్న చెప్పారట యివ్వాళ వస్తానని.

బాబు:- యిదివరకి చాలాసార్లు యిట్లాగే చెప్పి రాలేదుగా.

శార:- ఇవ్వాళ తప్పకుండా వస్తానన్నారట. అన్నట్లూ తైమవందే బడినుంచి వచ్చావేంరా ?

బాబు:- (విచారంగా) జీతంకట్టలేదని వెళ్లకొట్టారమ్మా.

శార:- రెండురోజుల్లో కడ్తానని చెప్పకపోయావా ?

బాబు:- చెప్పానమ్మా! జీతంకట్టందే రెండు నిమిషాలుకూడా క్లాసు లో కూర్చోటానికి వీల్లేదని తరిమేశారు.

శార:- పోనీలేబాబూ! మీ నాన్నగారు యెలాగూ వస్తు న్నారుగా- రేపు జీతం కట్టేద్దు గానిలె.

బాబు:- ఆకలవుతుందమ్మా. చొక్కా (పైకెత్తి) చూడవే డొక్కలు యెలాలోపలికి పోయాయో!

శార - పొంగిపొర్లే దుఃఖంతో బాబుని కౌగలించుకొని ఆదుర్దాగా) బాబూ!... కాస్సేపు వోపికపట్టునాన్నా. మీ నాన్నగారు రాగానే బియ్యం తెప్పించి ముందునీకు వంటచేసిపెడ్తాను.

బాబు:- కళ్లుతిరుగుతున్నాయే.

శార:- వెళ్లిపడుకో బాబూ. అన్నంవండాక లేపుతాను.

బాబు:- కాదమ్మ! నాన్నగారు రాగానే నన్ను లేపాలి.

శార:- అలాగే లేనాయనా. పోయిపడుకో (బాబుని వెంటపెట్టు కొని లోపలకు వెళ్తుంది)

సూర:- (బయటనుంచి ప్రవేశిస్తూవుండగా కాలికి దార్లోవున్న కుండ తగుల్తుంది. కుండ పగులుతుంది. ఆశబ్దంవిని శారద యింట్లోనుంచి వస్తుంది)

శార:- (సంతోషంతో) వచ్చారా? యెంతకాలానికి మామీద

దయకల్గిందండీ. (సమీపిస్తుంది) (బయటనుంచి మోహన్ ప్రవేసిస్తాడు)

సూర:- (కోపంగా) ఫో అవతలికి. దగ్గరకురాకు. నిన్ను చూస్తేనే పాతకం చుట్టుకుంటుంది. అసహ్యంపుడుతుంది.

మోహన్:-(సమీపించి) బావా! శారదనుచూస్తే పాతకంచుట్టుకుంటుంది కదూ? (నవ్వి) సావిత్రినిచూస్తే నీకళ్లకి పండుగ్గా వుంటుంది. శారద దగ్గరికొస్తే అసహ్యం పుడుతుంది. అదే సావిత్రయితే మనస్సుకెంతో ఆనందంగా వుంటుంది. యీ మాటలు మాట్లాడటానికి నీకు నోరెలావచ్చింది ?

శార:- కాశేపు నువ్వూరుకో అన్నయ్యా !

సూర:- ఊరుకోటం యెందుకు? ప్రపన్యాసం పూర్తిగాయివ్వనీ.

మోహ:- యిప్పటికైనా ఆలోచించి నిజం గ్రహించు. తాళి బొట్టు కట్టిన భార్యకాబట్టి తన్నినా పడుంటోంది. కూడు లేకపోయినా లోలోనే కుళ్ళిపోతోంది. కట్టుకోటానికి గుడ్డలేక యేడుస్తూన్నా కళ్ళనీళ్ళని మింగి కాలంగడుపుతోంది. యీవిధంగా ఆ సావిత్రిదగ్గర వ్యవహరించు. దానిదగ్గర నీ గౌరవం యేమవుతుందో.

సూర:- యేమయినాసరె - సావిత్రే నా కళ్లకి సర్వాంగ సుందరి - ఆ యిల్లే నాకు దేవేంద్రభవనం. ఆమె తీయని మాటలే నా జీవితానికి వెలుగుబాటలు. యీ మాటల్నే నీకు యెన్నోసార్లు చెప్పాను. మళ్ళీ చెప్తున్నాను. యెప్పుడుచెప్పినా యివ్వేమాటలని...

శార:- మీకిది న్యాయంకాదు. (బాబు నెమ్మదిగా ప్రవేశి స్తాడు) అబ్బాయి చూడండి. అన్నంలేక యెలా తల్లడిల్లి పోతున్నాడో...

బాబు:- (సూరయ్యని సమీపించి) నాన్నా! జీతం కట్టలేదని బళ్లోనుంచి గెంటారు.

సూర:- గెంటనీ — దానికి నేనేంచేస్తాను? నీకోసం, మీఅమ్మ కోసం వూరువూరంతా అప్పులుచేశాను. వచ్చేజీతం మీకోసం ఖర్చుచేస్తే చేసిన అప్పులేంచేయమంటారు? తీర్చేద్దనేనా?

శార:- అని అన్నానా? నెమ్మదిమీద...

సూర:- (ఈర్ష్యగా) చేసినప్పులు చచ్చేలోపు తీరుస్తానంటే వొప్పుకునే చచ్చువెధవ యెవడుంటాడు? శారదా! నీకు నీపిల్లడికి నేను సంపాదించిపెట్టలేను. ఆస్తిఅంటావా యెక్కడిదక్కడ హరించిపోయింది.

మోహ:- అంత చేతకానివాడివి పెళ్లెందుకుచేసుకున్నావు?

సూర:- చేసుకున్నానుకాబట్టే చెప్పవలసివచ్చింది.

శార:- మేమేంకావాలి?

సూర:- యేమన్నాకండి. నేనుమాత్రం సావిత్రినివదిలి వక్క క్షణం వుండను.

శార:- ఇది మీకు న్యాయమేనా?

సూర:- (విసుగ్గా) న్యాయం! ధర్మ!! అవి యేనాడో విడిచి పెట్టాను. వొకవేళ ఆచరించినా నీపట్ల అసలేఆచరించను.

మోహ:- ఆ అవసరం నీకెందుకుంటుంది? నీ హృదయపంజరంలో సావిత్రిని సుస్థిరంగా బంధించుకొని కులుకుతూ కూర్చోటమే నీకు న్యాయం. భార్య సుఖాన్ని పాడుచేసి, పాపపంకిలంలోకీడ్చి ఆ రంకులాడి కాళ్లుకడిగి నెత్తినిచల్లుకోటమే నీకు ధర్మం. అనుక్షణం దాని పాదాలువత్తి శిశ్రూషచేయటమే నీకు ముక్తిమార్గం. కావాలని కాళ్లుపట్టుకు బ్రతిమిలాడే భార్య మాటలుకంటే దానిమాటలే నీకు వేదాంతరాలు. అవే అస్తమానం స్మరిస్తూ వుంటావు. అవ్వే నీకుకావలసింది. అప్పడుగాని నీజన్మ తరించదు- నువ్వు చేశేపని మంచిదనియెంచకు. నిన్నుచూసి ప్రపంచం వికటాట్టహాసం చేసి కాండ్రించి నీ మొహానుమ్మేస్తుంది.

సూర:- (పెద్దగా) నోరుముయ్! (చెంపమీదకొడ్తాడు)

శార:- (శూన్యంగాచూస్తూ) ఆఁ!

సూర:- మళ్లీ మాటజారావాంటే మరణహోమం చేస్తాను. చెల్లెలిమీద నీకంతప్రేముంటే నీయింటికి తీసుకపోయి పూల మందిరంపెట్టి పూజించు.

మోహ:- పూజిస్తాను. అది నా మాటల్ని విన్నట్లయితే ఆ పని యెప్పుడో చేశేవాణ్ణి. అప్పుడే నీకు సరైన గుణపాఠం చెప్పేవాణ్ణి.

సూర:- యిప్పుడుమాత్రం మించిపోయిందేముంది?

మోహ:- అది నీలాంటి అవివేకి కాకపోవటమే.

సూర:- (కోపంగా) మళ్లీ నోరులేస్తోంది.

మోహ:- ఇంకొకసారి చెయిచేసుకుంటాన్ - అదేగా నీకుచేత నయ్యేది? ఆడదాన్ని వుసురుపెడ్తే మాటల్తో పోదు. యింతకింత పదిరెట్లు అనుభవిస్తావ్.

శార:- (విచారంగా) అన్నయ్యా! నాకోసం నాతోపాటు నువ్వు చెడ్డవాడివని పించుకుంటున్నావు.

మోహ:- అందుకు నేను చింతించటం లేదు. యే వ్యక్తీ అందరి దృష్టిలోనూ మంచివాడనిపించుకోలేడు. కొందర్లో కొందరు నిందలు వేస్తూనే వుంటారు.

శార:- భగవంతుడు నా నొసటన యిలా వ్రాస్తే తప్పించటం శక్యం అవుతుందా?

మోహ:- ఆనెర్రి వేదాంతాలని ఆదర్శంగా తీసుకుంటే నీ బ్రతుకు యేంకావాలి? దయాదాక్షిణ్యాలు లేని దరిద్రుని కోసం.

శార:- (పెద్దగా) అన్నయ్యా? నీమాటల్తో నామనస్సు మరింత బాధపడుతోంది. నామీదదయ నేదుంటే అలాంటి పరుష వాక్యాలు రానీయకు. ఆడదానికి భర్తకంటే దైవం వేరొకడు లేడు. ఆయన యెలాంటి అవినీతిపనులాచరిస్తున్నా నా ముందు పల్లెత్తు మాటంటే నేను సహించలేను.

సూర:- (విరగబడి నవ్వి) చక్కగా చెప్పావు.

మోహ:- నీ భర్త నీచానికి దాసోహం చేస్తూ వుంటాడు. నువ్వూ నీ కొడుకూ ఆకలిబాధతో అలమటిస్తుండండి.

సూర:- మోహన్ రావు! నా సంసారంలో తప్పులెంచటానికి యెవరిచ్చారు నీకీ అధికారం? యింట్లోచేరి యిదానువ్వాడే

నాటకం? శారదా! యీరోజునుంచి వాడిక్కడికి వచ్చా
డంటే నీబొమికలు యేరుతాను. ముక్కలుచేసి కాకులకు
ఫలహారంగా పంచిపెడ్తాను. ప్రాణంమీద తీపనేదుంటే
జాగ్రత్తగా సంచరించు (వెళ్ళిపోతాడు)

శార:- (కాళ్ళు పట్టుకొని) అప్పుడే వెళ్ళిపోతున్నారా?

సూర:- వెళ్ళక యీస్మశానంలో నీపాడు మొహం చూస్తూ
వుండమంటావా? అష్టులే. (పక్కకుతోసి వెళ్ళిపోతాడు)

బాబు:- (నీరసంగా) నాన్నా! (చెయ్యి పట్టుకుంటాడు)

సూర:- ఏం! ఏంకావాలి!

బాబు:- ఆకలిగావుంది నానా!

సూర:- అన్నంతిను...

బాబు:- రెండు రోజుల్నుంచీ బియ్యంలేక వండలేదు.

సూర:- (మోహనరావుని చూస్తూ) ఏం? ఆదుకోటానికి
మీమామయ్య వున్నాడుగా మీకు తిండిపెట్టటానికి నేనేం
పోసుకు కూర్చోలా.

బాబు:- జీతానికైనా...

సూర:- చదువుకొని యెవర్ని వుద్ధరిస్తావు! మానేశెయ్!
పన్నెండేళ్ళు మీదకొచ్చాయ్. యెక్కడన్నా కూలిపని
చేసుకేడవరాదూ? కడుపునిండా కూడుతిని కూర్చోవచ్చు.
(వెళ్ళిపోతాడు. బాబు 'నాన్నా' అని చెయిపట్టుకుంటాడు
బాబుని పడత్రోసి చరచరా వెళ్తాడు)

శార:- (పొంగిపొర్లే దుఃఖంతో) బాబూ! (అంటూ లేవతీసి
హృదయానికి అద్దుకుంటుంది. అనంతరం మోహనరావుని
చూసి) అన్నయ్యా!

మోహ:- శారదా! అహర్నిశలూ నిద్రహారాలు మాని కన్నీరు కార్చినందువల్ల కృశించి పోవటమేకాని ఫలితం లేదు. నిష్కారణంగా నిండుప్రాణాన్ని వదలపర్చి మనో వ్యాధికి మార్గంతీస్తున్నావు.

శార:- అంతకంటే యేంచేస్తాను.? పతికిదూరమై. కన్న కొడుకు ఆకలి బాధను కళ్లారా చూడ్లేకపోతున్నాను.

మోహ:- నిజమే! కష్టాలు సముద్రంలో కెరటాలులాంటివి. యెల్లకాలం కాపరముంటాయా? కాలచక్రం తిరుగుతూనే వుంటుంది. మంచిరోజులు ప్రతి వ్యక్తికీ, యెప్పుడో వొకప్పుడు తప్పనిసరిగా వస్తాయ్- తను వొకరికి చెప్ప వలసిన యీడులో తనే వకరిచేత చెప్పించుకుంటున్నాడు. ఆఖరిసారిగా అడుగుతున్నాను. కొంతకాలం కష్టాలు గడిచేవరకూ నువ్వూ బాబూ...

శార:- వద్దు. ఆడది పుట్టింటికి యెప్పుడూ బరువే. మంచో చెడ్డో పడినచోటే ప్రాకులాడాలి. (యేడుస్తుంది)

మోహ:- (నిట్టూర్చి నీరసంగా) సరే. వస్తా (బయటకు వెళ్తాడు)

బాబు:- (లేనివోపిక తెచ్చుకుంటూ) అమ్మా! యేడవకే. నువ్వేడుస్తే నేను అసలేఆగలేను. (ఆలోచించి) అమ్మా! నేనుయెక్కడన్నా పనిచేసి సంపాదించుకొస్తానే.

శార:- బాబూ! యేంపనిచేస్తావు నాయనా? యెవరిస్తారు? మనలాంటి కటిక దరిద్రుల్ని చూస్తే ధనికవర్గం దౌర్జన్యంతో దగ్గరకురానీయదు. (కంటతడి పెడ్తుంది)

శాంబు:- (తల్లికన్నీరు తుడుస్తూ) భయం లేదులేవే. యెక్కడెన్నో మాటలు మోసి...

శార:- మాటలుకాదురా. అసలే ఆకలి బాధతో డొక్కలంటుకుపోయినాయ్. నీరసంమీద నువ్వేం పనిచేస్తావు. ఆసంగతి వోపికవచ్చాక ఆలోచిద్దాం. నువ్వెళ్లి పడుకో... నేను వెళ్లి నాలుగిళ్లల్లో మాధవకోళంయెత్తి తీసుకవస్తాను.

శాంబు:- పెద్దదానివి. నేనుండగా ఆపని నువ్వేందుకు చేయాలే! నేనే వెళ్లొస్తాను.

శార:- వద్దునాయనా. నామాటవిను.

శాంబు:- (నిరసంగా) సరే నీయిష్టం (నెమ్మదిగా యింట్లోకి పోతాడు)

శార:- (విచారంగా పాడుతుంది)

యేమవుతుందో - నాబ్రతుకు
యేమికావలెనో - ఇకముందు ॥యేమ॥
పతికి దూరమైనా - ఆడదానికిని
గతి యేముంది - యీలోకంలో
దారేదీ లేదా - దరిచేరుటకు
మారేదే లేదా - వారి మనసు ॥యేమ॥
ఆశలన్నీ - నీటకలిశెన
ఆశ లేక నే - జీవించేదా ?
చెలరేగిన - తూపాను గాలిలో
గాలి మేడలు - కూలిపోయెనా
కలగా మారెన - జీవితరంగం ॥యేమ॥

— తెర —

# పెళ్ళయ్యాక చూడు

## 3 వ రంగము

[స్థలం : బజారు. జనం అటూ యిటూ గుంపులు గుంపులుగా నడుస్తూ వుంటారు. బాబు పాలిష్ డబ్బాలు. బ్రష్. పాతగుడ్డ పట్టుకు హుషారుగా పాడుతూ. ప్రవేశిస్తాడు]

సలాముబాబూ పాలిష్ చేస్తానూ
కాలిబూటుకీ పాలిష్ చేస్తానూ॥ ॥సలా॥

రంగురంగులా పాలిష్ లున్నాయ్
చకచకా పనిని చేసేస్తానుగ
రండి! దగాలేని పనిచూడండి
పొందీ! పాలిష్ చేయించుకోని॥ ॥సలా॥

దుమ్మూ్మధూళీ దులిపేస్తానుగ
సమానరంగులు చేసేస్తాను
కంటచూసినా నీడకనబడును
కంటికియింపుగ చేస్తానుకదా॥ ॥సలా॥

చేతకాదని చప్పరించకండీ
చేతికి బూటుని యిప్పించండీ
పురమాయించి పనిచూడండీ
సరదాకోద్దీ పైసాలివ్వండీ॥ ॥సలా॥

శివ:- (ముస్లీం యువకుని వేషంలో ప్రవేశిస్తాడు)

బాబు:- (శివపాదాన్ని సమీపించి) అయ్యా! బూటుపాలిష్ చేస్తా.

శివ:- హేమ్మిావోయ్! నాకీ పాలిష్ సేస్తావ్ నీకీ.

బాబు:- మీకుకాదుబాబూ! మీ కాలి బూటుకి.

శివ:- హా దేకాదూ నీకీ హాడిగేది? హిచ్చ్యాగా సేస్తావ్ కాదూ?

బాబు:- (చేస్తానన్నట్లు సంతోషంతో తలూవుతాడు)

శివ:- హాయి తేహింద (బూటు వూడదీసి యిస్తూ) తొందర్ గా సేస్తావ్వూ కాదూ?

బాబు:- అయిదు సిముషాల్లో చేసిస్తానుబాబూ! (ప్రక్కగా కూర్చొని పాలిష్ చేస్తూవుంటాడు)

శివ:- (సిగరెట్టు కాలుస్తూ అటూయిటూచూస్తూ నిలబడి వుంటాడు. రాముడు ఆదార్ని పోతోవుంటాడు) హారేయ్! రామ్డూ! హేక్డాకేవోయ్ పోతుంటావునీకి?

రాము:- (శివపాదాన్ని ఆశ్చర్యంగాచూస్తూ విసుగుతో) ఎవ రెహనువ్వు? యదవని మొగమెరిగిన మొగాణ్ణాగా పేరెట్టి పిలుత్తుండావ్?

శివ:- హెవరూహాయితే నీకూ హెందోక్యాయ్! మీకీ హామ్మగార్ హెక్డావుండార్?నాకీ పిల్యానంపార్ హెంద్కు?

రాము:- ఆఁ! (తెల్లబోయిచూస్తూ) నిన్నుపిలుననంపారే? (తనలో) కొంపతీసి కొత్తకేసు కామకందా! సచ్చిందిరా బర్రె. (ఆలోచించి) అసలుయిసయమేంటో తెల్సుకుంటా.

శివ:- అరె హేమ్టిమావోయ్. హడిగిన్దానికి జవాబ్ శెప్పవ్ నీకి ?మన్లోమనమ్మాట. హమ్మగారూ హింతకీ హింటాదగ్గరా వుండింది. లేంది బోలో.

రాము:- (ఆశ్చర్యంగా రెండుసార్లు క్రిందనుంచి పైకి శివ పాదాన్ని పరిశీలించి రెండు శెకండ్లు ఆలోచించి, విరగబడి నవ్వుతాడు) తస్సాదియ్యా మీరా ?

శివ:- హా రే హేమ్టిమావోయ్ ! హడిగిన్దానికీ జవాబీకి బోలో (కోపంగా చూస్తాడు)

రాము:- మనలోమనమాట. యేం శెప్పమంటారు? యిదిగో వొక టేమాట శెప్తున్నాను. మళ్లీ మాఅమ్మగోరి మాటెత్తారంటే యెముకలు.. (మళ్లీ నవ్వి) యేంగోరా! యీ రామిగాడి ముందలేనా మీ యేసాలు? మీ యేసం సూసేప్పటికే యదవని నాను బేజారై పోయ్యాను.

శివ:- (ఆశ్చర్యంగా) ఆరిపిడుగా! మనలోమనమాట కనుక్కోలేవనుకున్నాను. యెల్లా కనుకున్నావురా ?

రాము:- మీ యేసంసూసి అసలే గుర్తు పట్టనేకపోయాను. అంటారుగా మాటమాటకీ ముందు 'మన్లోమనమాట' ఆ మాటలోనే గురుత్తెట్టేశాను. (మళ్లీ నవ్వుతాడు)

శివ:- మన్లోమనమాట. యెందాకా వెడుతున్నావ్ ? మన్ని తీసుకురమ్మందా ?

రాము:- అమ్మగార్కి సూరయ్యగోడుమీద శెప్పాల్సినదంతా శెప్పాను. సూరయ్యని యింటోంసి తరిమేత్తే పెద్ద

సినిమా యాత్రవటానికి మా సాయేబుగారు దొరా యీలుంటుందని గట్టిగా శెప్పాను. మనస్సుయిరిగి రోజుకి మూడుసార్లు సెప్తోంది. రావద్దని. కానిదొరా! నాకొకటి మాత్తరం అనుమానంగావుంది.(చుట్ట ముట్టిస్తాడు)

శివ:- ఏమిటది ?

రాము:- బాంకిమానేజరు బత్రయ్యని యనకేసుకు రోజూ బంతాట్టానికి యెల్తోంది. అమ్మగోరు ఆయన్నేటన్నా వల్లో వేసుకుండారాని. మొన్న సూరియ్యగోరు వచ్చేసరికి ఆలిద్దరూ సిలకల్లాగ కిసకిసలాడుతోండారంట. ఆఅయ్య సూసి కోపమొచ్చి ఆళ్ళనితిట్టాడంట...

శివ:- (నీరసంగా) ఏమన్నావురా రాముడు! యింకనాపని యింతేనన్రా.

రాము:- అప్పుడే అంతకుంగిపోతారేం దొరా? వాకేల అట్టా సేసినా, సూరియ్యని యెల్లకొట్టంది, ఆణ్ణియెల్లకొట్టలేదూ? యెప్పటికైనా ఆడదాన్ని కట్టుకున్నాడేగతౌతాడు. తొందరపడితే యేటిపయోజనం.

శివ:- (నీరసంగా) తొందర కాకపోతే యింకెంతకాలం యిలా అజ్ఞాతవాసం చేయమంటావురా ?

రాము:- అందుకే యెత్తుయెత్తాంగా! యీ దెబ్బతో అటో యిటో తేలిపోద్ది. అంతా మీమాటల్లోనూ, మీగొప్పని మీరు పొగుడుకోటంలోనూ వుంటుంది.

శివ:- అందుకు నువ్వేం చేయమంటే అది చేస్తానన్నాను కాదురా... మనలోమనమాట. మాటవరసకన్నా తీసుకు రమ్మందా ?

రాము:- తీసుకురమ్మందిదొరా. యదవని అందుకేగా బయల్దేరి యెల్తున్నాను. దాన్లోనే మీరు కనుపింశారు. రండి యెల్దాం. '(వోకఅడుగు వేసి) కాని దొరా! మనలోమన మాట' అనేమాటని మర్చిపోకపోయారంటే కొంపలంటుకుంటాయ్. మీాకేకాకుండా పనీపాటా నేకుండా సునాయాసంగావచ్చే వలబై రూపాయలజీతం పోగొట్టుకుండవోణ్ణవుతాను. నౌకరీపోటంమూలంగా పిల్లాజెల్లాతో మాడిపోతాను. యిదికామోతే యెక్కడున్నా సూసుకుందామంటే, పెళ్లొంచి పనిశేయలేని యెదవని.

శివ:- మన్లోమనమాట యీా స్వాస్తంతా యెందుకురా ? యేమంటావో చెప్పు.

రాము:- మీరు మాటమాటకీ యేసే మనలోమనమాటని మర్చిపోయి ఆ యమ్మదగ్గర జాగత్తగా నడుసుకోవాలంటాను. అద్దదే నాను శెప్పేది.

శివ:- సరె. అలాగే!

రాము:- అయితే యింకా ఆలశ్యమెందుకు! రండి యెల్దాం. (రెండడుగులు వేస్తాడు)

శివ:- ఒరేయ్! రాముడూ!

రాము:- యింకేటిదొరా ఆలశ్యం?

శివ:- బూటు పాలిష్ చేయిస్తున్నాను (రెండడుగులు వేసి బాబుతో) అరె హాయిందిలేదువోయ్.

బాబు:- (పాలిష్ చేస్తు) అయిపోవచ్చిందండి.

శివ:- హారె వేగమ్ కానియ్‌వోయ్ నీకి.

రాము:- (బాబునిచూసి) ఆఁ! సచ్చిందిరాబట్రె. (నెమ్మదిగా) యీడెవడో తెల్సా?

శివ:- (నెమ్మదిగా) ఎవరు!

రాము:- సూరయ్య కొడుకు...

శివ:- ఆఁ! (ఆశ్చర్యంతో) సూరయ్య కొడుకా? (పరిసీలించి) అవున్రోయ్.

రాము:- దొరా! మీరు తొందరగా వచ్చేయండి. యదవని నాను ముందుగాయెల్లి మీ గొప్పతనాన్ని గురించి యింకా పొగిడుతూవుంటాను. పనికాగానే వచ్చేత్తారుకదూ?

శివ:- మన్లోమనమాట యెంతోశేపా? నీవెనకాలేరానురా.

రాము:- (వెనకెనక్కి చూస్తూ నిష్క్రమిస్తాడు)

శివ:- (బాబుని సమీపించి) హరేయ్! నీదీపేరూ హేట్మీ వోయ్.

బాబు:- బాబు—

శివ:- (నవ్వి) మన్లోమన్ మాట హెవక్కి బాబూరా నీకీ!

బాబు:- నాపేరే 'బాబు' (బూటు అందిస్తాడు)

శివ:- నీకీ హాయ్యపేర్ ? (తొడుక్కుంటాడు.)

బాబు:- ఎందుకు బాబూ?

శివ?- హబూ ర్కే తెల్సుకుందామ్హనీ. నీకీహిష్టంలేకాపోతె సెప్పాబోక్. నాకేవచ్చిన్ నష్టంహేన్టిం? (వెళ్ళబోతాడు)

బాబు:- (రెండడుగులు వేసి) డబ్బులు బాబయ్యా!

శివ:- (నవ్వి) ఢబ్బుల్! ఢబ్లూకావాలీహని ముందు హెంద్కు సెప్లానీకి. పాలిష్ శెయ్యాలాని నీకీ కోరానా? శేస్తానని నాకీ కోరావ్. బస్. హన్నమాటప్రకారం నాదీబూటూ హిచ్చాన్. నీకీ శేసీపెట్రావ్. హింకా డబుల్ గిబుల్తో పనీహేన్టా?

బాబు:- అయ్యా! తిండికిలేక డొక్కలంటుకు పోయినాయ్. నాచేత రెక్కలకష్టం చేయించుకొని, అలా వెళ్ళిపోవటం ధర్మంకాదు.

శివ:- హేన్టిరా? (కోపంగా) నీకీచారనా హిచ్చానూకదూ?

బాబు:- (ఆశ్చర్యంగా చూస్తూ) నాలగణాలిచ్చారం? యెందుకండీ ఆమాటలు? పెద్దవాళ్ళయుండికూడా పావలా డబ్బులికి అబద్ధమాడుతున్నారు?

శివ:- హెష్టూరారా హబద్ధం హాడిందీ? హొళ్ళూ దగ్రా పెట్కూ బోలో. హెవ్డీదగ్రా హెట్టా మాట్టాడాలో నీకీ తెల్సుకూ మాట్లాడాహోయ్. (చరచరా వెళ్తాడు)

బాబు:- (విచారంగా) బీదవాడు పట్టెడన్నంకోసం ప్రాకులాడుతాడు. ధనికుడు అన్యాయం చేయటానికే ఆరాట పడుతూ వుంటాడు. రెక్కలు కష్టంమిగిలి పోయింది.

(మళ్లీ పాలిష్ పాట పాడుకుంటూ వెళ్తాడు. వెంటనే తెర యెత్తబడుతుంది. రంగాలంకరణంతా మొదటి రంగం మాదిరే వుంటుంది. సావిత్రి వుత్సాహంతో పాడుతూ వుంటుంది. రాముడు తనలోతాను తన్మయత్వం చెందుతూ వుంటాడు)

ఆడుతా పాడుతా ఆడుతా
రాగములో అనురాగము కలిపి॥ ॥ఆడు॥

లలల్ల, లలల్లా, లలలలల్లా
లలల లలల లలలలల్లా
నా సొగసె తీపి మిఠాయి కాదా
అదేకాదా ప్రేమ యీ జగాన
అందచందములు నా సొమ్మో
వొలికే కులికే అనురాగమదే ॥అడు॥

అహాహ్హాహాహ్హా, హాహాహాహాహ్హా
అహాహాహా హాహాహా హాహాహ్హా
అందాల చందమామాయె అందనిరాజు
యిలలో కులికే రాణిని నేనే
నా హృదయసీమ అంతానిండే
వెన్నెలలో వయ్యారిని గాన ॥ఆడు॥

రాము:- (పెద్దగానవ్వి) బలేబలే! మాబాగా పాడేసినోరండి. యీ వూళ్లో మీనాగపాగ ఆడమనిషి నేదంటేనమ్మండి.
సావి:- ఎలావుంది పాట ?

రాము:- (సంతోషంతో) ఆమాట వేరేఅడగాలా? మీ పాట యింటుంటే యెదవని నాకు పంచదారసిలక తిన్నట్టుంటాది. నాకేటి? మీ పాట యిన్నోళ్లందరికి అంతేననుకోండి.

సావి:- (నవ్వుతుంది)

రాము:- అదేటండి? అంతానవ్వు నవ్వుతుండారు? నా నేటన్నా తప్పుమాటన్నా నేంటి యెదవని?

సావి:- లేదురా నీమాటలు వింటుంటె నవ్వొస్తోంది.

రాము:- మీ కే నేంటి? యీ రామిగాడి మాటలింటే యిన బడని యెర్రోడుకూడా నవ్వాల్సిందే. (రాముడు నవుతాడు సావిత్రికూడా నవుతూవుంటుంది. యింతలో తలుపు చప్పిడవుతుంది. నవ్వులు వొక్కసారిగా ఆపి ఆలకిస్తారు)

సావి:- ఎవరో వచ్చినట్లుచ్చారు. చూడు.

రాము:- ఎవరొత్తారు? సూరయ్యగోరేమో!

సావి:- చెప్పానుగా మళ్లీ యెందుకొస్తాడు.

రాము:- శెప్పినంతమాత్రాన రాకుండవుంటారా? అదంతా ఒకపిచ్చి. (మళ్లీతలుపు చప్పుడవుతుంది) ఎవరో వత్తుండా ఆగండి. (వెళ్తాడు. అనంతరం శివపాదాన్ని వెంట పెట్టుకొస్తాడు)

సావి:- (తెల్లబోయి చూస్తూ ఎవరండీమీరు?

రాము:- (నెమ్మదిగా) నాను సెప్పిన తురక డోట్టరుగోరు.

సావి:- (సంతోషంతో) అలాగా? (శివపాదంతో) నమస్కారం. (నమస్కరిస్తుంది)

శివ:- హిహీహిహి గుడ్ మోణింగ్... గుడ్ మోణింగ్.

సావి:- (సోఫా చూపిస్తూ ప్రేమగా) కూర్చోండి.

శివ:- యస్. యస్. (కూర్చుంటాడు)

సావి:- మీ ప్రతిభ మా రాముడు చెప్పాడు. (పక్కగావున్న కుర్చీలో కూర్చుంటుంది)

శివ:- (నవ్వి) మా ప్రతిభలోకమ్ హంతాకీ తెల్సునూకాదూ? సినిమా డైరెక్టర్ షరీఫ్ హంటే తెల్యానీహోళ్లూ హుంటారూహండీ. (రాముడు కూర్చుంటాడు)

సావి:- ఇప్పుడేవస్తాను. (లోపలకు వెళ్తుంది)

రాము:- (సావిత్రి వెళ్లినమార్గాన్ని వకసారిచూసి కొద్దిగా జరిగి శివపాదంతో) దొరా! మనలోమనమాటమర్చిపోండి కొంపలంటుకుంటాయ్. ముందు ఆయమ్మకి ఆమాట యీ మాటా శెప్పి బుట్టలోయేసుకోండి. తరవాత యిక్కణ్ణుంసి మకాం యెత్తటానికి యెత్తెయ్యండి. తెల్సిందా?

శివ:- అదేకాదురా నా వుద్దేశ్యంకూడా. మన ప్రయత్నం మనంచేద్దాం. మనలోమనమాట సక్రమంగా అవుతుందా సరేసరి. మనప్రయత్నం ఫలిస్తుంది. లేకపోతే...

రాము:- (ప్రక్కకుచూసి శివపాదంతో నెమ్మదిగా) వచ్చేత్తుండారు. (సరిగా కూర్చుంటాడు)

శివ: (రాముడుతో) సిన్మాలో వేషంహాంటే మాటల్ హానుకుండావ్ నీకి? (సావిత్రి కాఫీతీసుకు ప్రవేశిస్తుంది) పేడా ఎత్తే పాలేర్వి నీకుం హెందో క్యాయ్ సెనిమా?

సావి:- (నవ్వి కాఫీ శివపాదం ముందుపెట్టి రాముడుతో) సినిమాలో యాక్టు చేయాలని వుందేరా నీకు?

రాము:- (నవ్వి) యదవని నా బొంద నా కెందుకండీ? వూరికే కూసుంటే వూసిపోక అడిగాను.

సావి:- (నవ్వుతూ కూర్చుంటుంది) కాఫీచల్లారిపోతుంది- తీసుకోండి.

శివ:- (కాఫీ అందుకొని సావిత్రితో) తుమారా నామ్‌బోలో. (త్రాగుతాడు)

సావి:- సావిత్రి-

శివ:- (ఆశ్చర్యంగా) సావిత్రీ! బహుత్ హాచ్చాగా వుండింది. దిల్‌కుష్ నామ్.

సావి:- అనుభవిస్తున్న మామూలు జీవితంకంటే సినిమా జీవితం అనుభవిస్తూ, ప్రస్తుతంలో పైకొస్తున్న తారలందర్నీ పడత్రోయాలని అభిలాషగావుంది.

శివ:- మీాదీ హాబిలాషా తీర్చటానిక్కాదూ మేమూ హొచ్చింది! హదిమాకీ హెంతపనీ? మాకీ తలుచ్చాకుంటే నిమ్షాల్ మీాద హావుతుంది.

సావి:- అది మీారు వేరేఅనాలా? మీా మాటలో నేవుంది ఆ మాధుర్యం.

శివ:- మన్లో... అలఅల మీాకీ పాట హొక్వారాదూ హాను కుంటాం మాకీ.

రాము:- బలేవోరునాంగ న్నారే. అమ్మాగోర్కి పాట రాక పోటమేంటి? అమ్మగోరు పాటాటు వోనూ పాల్లేరు. 'కో' అంటే కోటి పాటలొచ్చు. కావాలంటే పాడించి సూసు కోండి.

శివ:- హిప్డూ హంతాపనీ హొద్దు.

సావి:- అన్నట్లు అడగటం మర్చాను మీా కంపెనీపేరు ?

శివ:- అలఅల ఆ! షరీస్ప్రొడక్షన్స్. మాందీహాపీసు జలందర్ ఫూర్... హంగుల్ పూర్తికాగానే మాదీ హాఫీస్ బొంబాయికీ టాన్సఫర్ శేస్తామ్.

సావి:- తీయదల్చుకున్న పిక్చరుపేరేమిటో ?

శివ:- హొక్టి హేమిా ? హొక్టి హెన్న హొక్టి, హొక్టి హెన్నా హొక్టి వరసాగా తీసివా రేస్తామ్ కాదూహొండి.

రాము:- అన్నింటల్లోనూ అమ్మగారుకీ పెద్దాశం యిస్తారా ?

శివ:- హ దేకాదూ హిప్డూ మాకీ హాలోశన. (సావిత్రితో) మీాకీ మొహంసూస్తే మాకీ కొత్తాకొత్తా వ్హూహాల్ వస్తూవుండాయ్. మీాకీ బహుత్ హచ్చాగా పైకీవస్తార్. హొక్టి పిక్చర్‌కీ హెంతాతీసుకుంటార్? రెండూ పిక్చర్‌కీ హేంతా తీసుకుంటార్ ?

సావి:- ఆ ఫీల్డులో నాకింతవరకూ పరిచయంలేదు. అందుకని ఆ మాటకూడా మీారే శెలవివ్వండి.

శివ:- ముందూ మీాదీ మాటా శెప్తే, తర్వాత మాదీమాటా శెప్తామ్.

రాము:- వొక శేమాట దొరా. అమ్మగారికి అట్టాటి వేటీ లేవు. మీారు యెంతిచ్చినా పుచ్చుకుంటారు. యేమండీ అమ్మ గోరూ అంతేకాదూ... అయ్యగార్కి వొకపాట యినిపించండి. గుమ్మయిపోతారు.

శివ:- హిప్డూనాకీ పనీహుండాది. రాతిర్ కీ వచ్చి మీాదీపాట హింటామ్.

సావి:- (చిరునవ్వుతో) అలాగే నిాదయ. ఒకమాట. మీారిచ్చే పైకం నా కుటుంబానికి సరిపోవాలి.

శివ:- కుటుంబం హంటే హెంతమంది మీాకీ?

సావి:- ప్రస్తుతానికి నేను వొక్కతినే. నాతోపాటు రాముడు.

రాము:- సచ్చిందిరా బర్రె. యదవని నానుకూడా పట్టం రావలసిందే! అయితే అమ్మగోరూ! పోనీశివపాదంగోర్ని కూడా...

సావి:- (రాముణ్ణి కోపంగాచూస్తూ) రాముడూ!

శివ:- హంటే హోయనీక్ హెవర్ ?

రాము:- అమ్మగోరి మొదటిబర్త.

శివ:- (తెల్లబోయి చూస్తూ) హెట్లా? మొదటిభర్తా! హంటే హెంతమంది భర్తల్ ?

సావి:- (రాముణ్ణి కోపంగా వొకసారిచూసి శివపాదంతో) అంతా వట్టదే షరీఫ్ గారూ!

రాము:- అవును. (నవ్వి) యదవని యగతాలికన్నాను.

శివ:- (కోపం అభినయిస్తూ) మాతో హేమిటా హెగతాలి?

సావి:- క్షమించండి. వాడికి మాట్లాటం తెలియదు.

శివ:- హాయితే మీాదీమాటా శెప్పండీ.

సావి:- నేనెప్పుడూ స్వేచ్ఛగా వుండాలని చూస్తాను. పెండ్లి చేసుకుంటే ఆడదానికి స్వేచ్ఛఅనేది వుండదు. ఆమె ఆనందానికి భర్త అనుక్షణం అడ్డు తగుల్తూవుంటాడు... నిజంగా నేను సినిమానటి అవాలనే తలంపుకూడా స్వేచ్ఛాజీవితం అనుభవించాలనే. తప్పకుండా మీా మాట ప్రకారం సినిమాల్లో యాక్టు చేస్తాను.

శివ:- హాయితే మాదీమాట హినీ బొంబాయికీ మకాం మారూస్తారూకాదూ మీాకీ.

రాము:- రాతకోతలయితే రాకేంసేత్తారు? యేదో అడ్వాన్సు యిప్పించండి. (సావిత్రితో) యేమండి అమ్మగారూ అంతేనా?

సావి:- (అవును 'అన్నట్లు' తలూపుతుంది)

శివ:- రాతకోతల్కీ హేమిాహుంది? హొక్కమాటాహుంటే సాలద్? హెడ్వాన్సుల్ గిడ్వాన్సుల్ హన్నీ బొంబైలో హిస్తామ్.

సావి:- అలాగే షరీఫ్‌గారూ! మీా మాట కాదంటానా?

శివ:- రాత్రిర్కీ మీాదీపాటా హింటాన్కీ వొస్తాంకదూ? హిప్డూ కావాలీ హంటే కొంతా హిస్తామ్.

సావి:- వద్దులెండి. మీకు మా మాటయందు నమ్మకం, మీకు మా మీద దయవుంటేచాలదూ? ఎప్పుడిచ్చినా ఫరవాలేదు (సూరయ్య మాసినగెడ్డం, చెదరినజుట్టూ, చినుగుపట్టిన బట్టలుతో ప్రవేసిస్తాడు. సావిత్రి సూరయ్యని కోపంతోచూసి నొసల్లు చిట్లిస్తుంది. శివపాదం సూరయ్యని తెల్లబోయి చూస్తాడు. అది సావిత్రిగమనించి) అదొక అవుతారంలెండి.

శివ:- హేమ్టీ హావతారమ్?

సావి:- దరిద్రావతారం. (సూరయ్యతో) ఎందుకొచ్చావ్?

సూర:- ఎందుకొస్తాను సావిత్రీ! నీకోసమే. నిన్ను విడిచిపెట్టి వొక్కక్షణం గడపగలనా?

సావి:- అవన్నీ ఆనిక మాట్లాడుకుందాం. ప్రస్తుతానికి మీరిక్కణ్ణుంచి దయచేయండి. పెద్దమనుష్యులతో మాట్లాడుతున్నాను.

సూర:- పెద్దమనుష్యులు... అంటే నాలాంటి వారేనా?

శివ:- (కోపంగా) హరే నీకీ నాకీ హేమ్టీహోయ్. నీకీ బికారి నాకీ షాహుకార్...

సూర:- ప్రథమంలో నీకంటే షాహుకారిని. కాలచక్రం తిరిగింది. సావిత్రికి కళ్లు నెత్తిమీదకొచ్చాయ్. దగాపడి దరిద్రుడుగా మారాను.

సావి:- మీ సొళులు వింటానికి యిక్కడెవరూ సావకాశంగా కూర్చోలేదు. ముందిక్కణ్ణుంచి వెళ్లండి.

సూర:- ఎక్కడికి వెళ్ళమంటావ్ ?

సావి:- అది నన్నడుగుతావేం? యెక్కడికన్నావో— యేమన్నాకా— అంతే. యిక్కడికి రావద్దని యింతకు ముందు యెన్నోసార్లు చెప్పాను.

సూర:- చెప్పినంతమాత్రాన సరిపోతుందా?

శివ:- (కోపం అభినయిస్తూ) హెందుకు సరిపోదు?

సూర:- (నవ్వి) పాపం వంతపాట పాడుతున్నారు మీరు సావిత్రి మూడవ మగడా?

సావి:- చాల్లే! ఆపు.

రాము:- సూరయ్యగోరూ! ఏంటి పెద్దోళ్ళతో యగతాలి?

సూర:- నేనూ వోకప్పుడు యీ యింట్లో యిలాంటి పెద్దనే.

శివ:- (కోపంగా) హరే హిప్పూ హేంప్టీ హాండీ హాంటాగ్ మీకీ? నాకీ సావిత్రికీ మొగ్గూహానీకాదూ మీకీ హనుమానం? హయితే తప్పూలేద్. దాన్కిమాట మేమూ సూస్కుంటామ్ మధ్యా మీకీహెందుక్- మాకీ సంగతీ.

సూర:- ఎందుకా? సావిత్రి నా స్వాధీనంలో వుంది.

సావి:- అలాగని ఎక్కడ వ్రాశుంది? మాటలు మర్యాదగా రానీయ్. నీకూనాకూ యేవిధంగానూ సమంధంలేదు. మాటయందు లక్ష్యముంచి యిక్కడనుంచి వెళ్ళకపోతే మెడమీద కర్రేసి గెంటిస్తాను.

సూర:- ఆఁ! పాతకి యెంతమాటన్నావ్? వెనకటి జీవితం మర్చిపోయావా? (నవ్వి) గెంటిస్తావా? ఎవరు గెంటేది? రమ్మను.

సావి:- (ఈర్ష్యగా) ధోరణి మితి మీరుతోంది. నువ్వేం చేస్తావో చూస్తాను. (రాముడుతో) రాముడూ! చూస్తావేం? యీ శని గ్రహాన్ని యిక్కడ్నుంచి గెంటెయ్.

రాము:- ఓ! మీరు 'ఉ' అంటే యదవని అదెంతపని (సూరయ్య జుట్టుపట్టుకొని) యేంటయ్యా తెగ నీలుగు తుండావ? యింటోంచి యెల్లమంటుంటే సిగ్గునేదూ? యెల్లవేం?

సూర:- (విదలించుకొని కోపంగా రెండడుగులు వేసి) నరపిశాచీ! యేమిటేఅన్నావ్? గెంటాలా? విశ్వాసఘాతికీ... గతం సంగతి మర్చిపోయావా? తింటానికి తిండిలేక నువ్వూ నీ భర్త మాడిపోతుంటే సమయానికి ఆదుకున్న దెవరో గుర్తులేదూ? వుండటానికి పంచలేక పూరిగుడిశలో పందికొక్కు కన్నాల్లో కాపురమున్న నిన్ను రక్షించి యీ భవనం కట్టించి యిచ్చిన బ్రహ్మదెవరో గుర్తుందా? నా అరవై యకరాల మొఖాసా, ఆయిదంతస్తుల మేడా యెవరి మూలాన పాడు చేశానో గుర్తులేదూ?

శివ:- హాసంగతీ హావిడకీ హేప్పి తెలుస్తుందిహోయ్.

సూర:- (శివపాదాన్ని) నోర్ముయ్!

శివ:- (ఉలిక్కిపడతాడు)

రాము:- ఆయన్ని యిప్పుడెందుకయ్యా యిప్పుడీడనుంచి యెల్లమంటుంటేనూ. కదలవేంటెహే. (చెయ్యి పట్టుగుని గుంజుతాడు)

సూర:- (చెయ్యి విదిల్చుకొని) వెడతాను. సావిత్రీ! యవ్వనంలోవున్న ఆడదానివని మిడిసిపడబోకు ఆ స్థి వున్నంత శేపూ ప్రేమిస్తావు... ఆ స్థి లేకపోతే నీ దగ్గర ప్రణయం ప్రళయంగా మారుతుంది. వొక్క నీదగ్గరేకాదు. వ్యభిచారులుగా జీవించే నీలాంటి వ్యక్తులందరిదగ్గరా అంతే.

రాము:- ఆ మాట ముందే తెలుసుకుంటే?

సూర:- లేదుకాబట్టే యీ రాక్షసిని నమ్మాను. అనుభవిస్తున్నాను.

సవి:- ఆం! రాక్షసినా?

సూర:- ముమ్మాటికీ రాక్షసివే. అందులో నరరూప రాక్షసివని నీ చేష్టలే రుజువు చేస్తున్నాయ్. లోకుల నోళ్లుకొట్టి కూడపెట్టిన సొమ్ము నీ కూడా రాదని గ్రహించు. ప్రాణం వున్నంత శేపే నీకు కనిపిస్తుంది. తర్వాత కనిపిస్తుందనుకున్నావా? సావిత్రీ! బాగా ఆలోచించు. నేను యెలాంటి స్థితిలో నీ యింటికి వచ్చానో, యీ రోజున యేవిధంగా మారానో, నాజీవితం యిలా మారటానికి కారణమేమిటో బాగా ఆలోచించు. కట్టుకున్న భార్యని కాదని, కూడదని బ్రతిమిలాడిన బావమర్ది మాటలు వినక, వున్నవొక్క కొడుకునీ మర్చిపోయి, నీకోసం, నీ సంతోషంకోసం, నీ యింట్లో కాపలాకాశాను. ఆనాడు గౌరవించి ఆహ్వానించిన నీ చేతుల్తో యీనాడు కుక్కకంటే హీనంగా చూసి గెంటిస్తావా? యిదేనా న్యాయం? నీ మూలాన

నా శారదని, శాబుని అనేకవిధాల తూలనాడి, వాళ్లంటే అసహ్యించుకొన్నాను. ఆకారణంగా వాళ్లు తిండికి మొహంవాచి కాకుల్లాగా గోల చేస్తున్నారు.

సావి:- వాళ్లు నీకోసం గోల చేస్తుంటే నిన్నిక్కడ వుండమని బ్రతిమిలాడిందెవరు? పెళ్లన్ని కొడుకునీ మర్చిపోయి, నా అందాన్నిచూసి నీకళ్లకి పొరలుకప్పి నీకునువ్వే నా యింట్లో పడుండి నాకు దాసోహంచేశావ్. నీ ఆస్తంత నీ నీ జ్వాలక్రిందే వినియోగించుకన్నావు. అప్పుడు నా యింట్లో చేరవచ్చిన కారణాన యిప్పుడు నన్ను వీధికి లాగి నువ్వు వీధిలోపడ్డావ్. నీమూలాన అమాయకుడైన నా భర్తకళ్లుకప్పి, ఆయన్ని యింట్లోనుంచి తరిమేశాను.

శివ:- హేమ్బ్రో శేశావ్ హేమ్బ్రో శేశావ?

సావి:- (శివపాదంతో) దయవుంచి కాళ్ళే పుమిూసువ్రాయకోండి డైరక్టర్ గారూ! తీయని మాటల్లో తేనెలు కురిపించి...

సూర:- తేనెలు కురిపించింది నువ్వా నేనా వంచకీ! నీనిలువంతా అన్యాయంతో నిండిపోయింది. యిలా యెంతమందిని యేడ్పించి వాళ్లసంసారాలు నీ పొట్టన పెట్టుకుంటావ్.

సావి:- (పెద్దగా) నోర్ముయ్! మళ్లీ పొల్లుమాట రానిచ్చావంటే నీ ప్రాణాలు నీకు దక్కవు.

సూర:- నాకింక బ్రతకాలనే తీపిలేదు. సర్వం కోలుపోయిన నేనింక బ్రతికి యెవర్ని వుద్ధరిస్తాను? యింకా కూడపెట్ట వలసినదానివి. సంసారాలు కూల్చ వలసినదానివి.

ఆ అభిలాష నీకుండాలి లక్షలు ఆర్జించాలని ఆశతో కూర్చున్న నీలాంటి ధనపిశాచికి పుట్టింది బ్రతుకుమీద తీపి. మాటల్లో దేవరి పాత్రానని అనుకోనను. నీలాంటి నక్క ప్రవర్తనకిల ఆపదాన్ని ముక్కలు చేయాలి. చూడు నిన్నేంచేస్తానో (అని మీదకు వెళ్తూవుంటాడు)

సావి:- (గాభరాగా రెండడుగులు వెనక్కు వేసి) రాముడూ !

రాము:- (బల కొద్దీ సూరిని ఈడ్చి బయటకు త్రోస్తూవుంటాడు. శివపాదంకూడా లేచి రాముడికి సాయంచేస్తాడు) పద...

సూరి:- (పెనుగులాడుతూ) సావిత్రీ! సావిత్రీ! (విధిలేక బయటకు వెళ్ళిపోతాడు)

శివ:- (చేతులు దులుపుకుంటూ ప్రవేశించి) హెందుక్కు హెందుక్కు హానీ సూస్తావుంటే సాడాదాని మీదికి హెగిరెగిరీ పడ్తావుండాడ్ పిరికి బెగ్గ్యం ఇహాంటే తెలుగ్గాకో లేకాపోయిండ్. (కూర్చుంటాడు. రాముడు శివపాదం వెనక వచ్చి కూర్చుంటాడు)

రాము:- (విసుగ్గా) అబ్బ్బగోసా! మీ రేటున్నారే. మళ్ళీ యీ నాయాలొస్తే యెదవని యెముకలిరకొట్టి పంపిస్తాను. (కూర్చుంటాడు)

సావి:- (కోపంగా) ఆపని యిప్పుడేచేస్తే సంతోషించేదాన్ని చచ్చినట్లు పడుండేవాడు. అమ్మయ్య! పీడవదలిపోయింది. (తేరుకొని) వాడిదంతా నాటకం. మీరు పొరపాటున నమ్ముతారేమో! నమ్మకండేం.

రాము:- ఎందుకు నమ్ముతారు లెగండీ. యీఅయ్యగోరు లేసింది మొదలు పడుకు నేదాకా యిట్లాంటి వెన్నో సూత్తా వుంటారు.

శివ:- మన్లోమన్ మాట హదేకాదూ నాకీ శెప్పేది?

రాము:- (గాబరాపడుతూవుంటాడు)

శివ:- హీడ్కీ మాటల్ నాకీ లెక్కా సేస్తాన్ హండీ. హింతకీ మన్లోమన్ మాట మీకీ బొంశాయ్ రావటాన్కీ...

సావి:- (అనుమానంతో శివపాదాన్ని పరికిస్తూ) అనుమానం యేమీ లేదండి! చూడండిమీరుఫిలింకంపెనీడై రెక్టర్ గా రేనా?

శివ:- హిందాకాహాయ్ హిప్పూ కాకపోతాన్ నాకీ.

సావి:- మనలోమనమాట యిలా వేషంతో మోసంచేసి యెంతమందిని అధోగతిపాలుచేస్తారు? (లేచిసమీపిస్తుంది)

శివ:- (భయపడుతూ) హదోగత్ హది హంటేహేట్మీ? హింతకీ హేంట్మీ మీరు సూస్తార్?

సావి:- మనలోమనమాట అంటించిన గెడ్డం వూడిపోతుంటేను (గెడ్డం లాగుతుంది. గెడ్డం వూడిపోతుంది. రాముడు భయపడుతూ వుంటాడు)

శివ:- (గాబరాగా) నెనెనేనే సావిత్రీ! నెనెనేనే!

సావి:- (కోపంగా) ఛూ! సిగ్గులేదు? మళ్లీ నాగుమ్మం తొక్కడంటే యెందుకొచ్చావ్? ముందిక్కణ్ణుంచి పోతావాపోవా? నువ్వు మనిషివికాదూ? నీకు పౌరుషం

లేదూ? తాలిబొట్టుతోసహా తెంపిపారేస్తే నీకూ నాకూ యేంసమంధంవుందని మళ్ళీవచ్చావ్?

శివ:- (విచారంగా) యే ముహూర్తాన మనిద్దరికీపెళ్ళయిందో, ఆరోజునుంచి నిన్నుచూడకుండా వొక్కనిముషం కాలం గడపలేకుండావున్నాను. ఆలీమగలమధ్య అవాంతరాలు అనేకం వస్తూవుంటాయ్ పోతూవుంటాయ్. అవన్నీ లెఖ్ఖచేస్తే ఎల్లా? కోపంవచ్చినప్పుడు అనేకం అనుకుంటాము. అవన్నీ మర్చిపోకపోతే......

సావి:- నువ్వేన్నన్నా చెప్పు. నీ మొహంచూడాలని నాకు లేదు. అ ... నాకూ రుణంతీరిపోయింది. మర్యాదగా వెళ్ళ - దేహశుద్ధిచేస్తాను. వెళ్లు......

శివ:- ఆఁ! మనలోమనమాట దేహశుద్ధా? (రాముడువంక చూస్తాడు)

సావి:- రాముడూ! యిదా నువ్వాడిన నాటకం? నువ్వంటే యింతవరకూ నాకెంతో విశ్వాసంవుండేది? యీకథకి కారకుడవు నువ్వేకాగూ? యీక్షణంనుంచీ నాయింట్లో నువ్వుండఖ్ఖర్లేదు. పనిమానుకువెళ్లిపో.

రాము:- (భయంతో) యదవని నేనేంశేశానండీ అమ్మగోరూ!

సావి:- యేంచేశావా? యేంచేశావో నీకు తెలియదూ? మళ్లీ నేను చెప్పాలా? మీరిద్దరూ ముందిక్కణ్ణుంచి వెళ్లండి. 'ఊఁ' (పెద్దగా) వెళ్లరేం?

శివ:- (వులిక్కిపడి) రారా రాముడూ యేమిసేస్తాం మనలో మనమాట యిదంతా మనఖర్మం.

రాము:- (వినయవిధేయతలతో) పిల్లలుకలవాణ్ణి నన్ను క్షమించండి అమ్మగోరూ. మళ్లీ యిటువంటి పనులు శేత్తే అప్పుడేపం పెద్దురుగాని. అయ్యగోరు మిమ్మల్ని చూడకుండ వుండలేనని బతిమిలాడితే బుద్ధిగడ్డితిని యదవపని యీ పనికి వప్పుకున్నాను. నామాటినండి.

సావి:- (నిట్టూర్చి) సరే. యీసారికి నిన్ను క్షమించి వూరుకున్నాను. యిక యిలాంటి పనులకి తలవంచావా నీకు పుట్టగతుల్లేకుండా శేస్తాను. జాగ్రత్త ముందాపీనుగని బయటకు పంపెయ్. వేషం

శివ:- (బ్రతిమాడుతూ) సావిత్రీ! సావిత్రీ! నన్నుకూడా...

సావి:- ఆమాట నేనువినకూడదు. వెళ్లు. రాముడూతొందరగా పంపెయ్. (చరచరా యింట్లోకిపోతుంది)

శివ:- ఒరేయ్ రాముడూ! మనలోమనమాట చచ్చినీకడుపున పుడతానురా యెలాగయినా సావిత్రితో చెప్పినప్పుడు నేట్లు చేయరా.

రాము:- యదవని నేననుకున్నంతా శేశారు. మీమూలాన నానోటికాడకూడు పోయేది? పనిపాటా నేకుండా హాయిగా కూసునితినే నౌకరీ మల్లీ నా కెట్టాదొరుకుద్ది? మీతోకలిసి పనిచేత్తే కుక్కతోక పట్టుకొని గోదావరీదినట్టే. సాలు సాలుగాని యెల్లండి. మల్లీ అమ్మగారొత్తే అగ్గయిపోతారు.

శివ:- (నీరసంగా)మనలోమనమాట అంతేనా ?

రాము:- అంతకాక యెంత ? యెల్లండి. (మీసం మెలేసి నకిలిస్తాడు)

శివ:- (దుఃఖ్ఖ ఆపుకోలేక పైకి పెద్దగా యేడ్చి నిష్క్రమిస్తాడు)

రాము:- ఆరి భగవంతుడా. యీ పెళ్లిళ్లు యెందుకు శేత్తుండావురా ? సూడు శివపాదంగారు పెళ్లాంకోసం, మొగుడికోసం సూరయ్యగోరి పెళ్లాం. యెట్టా యేడుత్తుండారో. (అంటూ పుగాకతీసి చుట్ట చుడ్తావుంటాడు. తెర నెమ్మదిగా జారుతుంది)

— తెర —



# పెళ్లయ్యాక చూడు

## 4 వ రంగము

[సూరయ్య బాగా పెరిగిన గెడ్డంతో చిరిగిపోయిన గుడ్డలతో గోదావరి స్టేషన్ సమీపాన రోడ్డుమీదకి ప్రవేశిస్తాడు రోడ్డుమీద జనం అటూయిటూ తిరుగుతూవుంటారు. తెరలో పాట వినిపిస్తుంది]

ప్రపంచమంత టక్కు — చెప్పేదిఅంత టవలి
ఏనాటికిదే లోటు — అననేల వేరె మాట ॥ప్రపం॥

పెళ్లయ్యాకచూడు — లేకుండ పాపభీతీ
పెళ్లాన్ని మరచిపోయి — కులకంగ వారికరితోన ॥ప్రపం॥

తలక్రిందుఆయె బ్రతుకు — కాసింత లేకవిలువ
విలపింతువేల యింక — చేచేతులార చేసి ॥ప్రపం॥

నీబాట నీకులేదా — యింకైన తెల్సుకోనక
ఏబాటపోదువోగా — యీమాటనిజముకాద ॥ప్రపం॥

ఘూటయిన మాపుత్తోటి — మాటైన లేకసతితో
ఎటుపోదువింకనీవు — అడిగావమనసుతోటి ॥ప్రపం॥

సూర:- (నిస్పృత్తువతో) హహహహ- అంతామోసం. పెళ్లయ్యాక భార్యకీభర్తకీ యెడబాటు తండ్రికీ పిల్లకీ యెడబాటు- యిది అనాదినుంచీ వస్తున్న అలవాటు. యిదే యీ ప్రపంచంలో జరిగే విచిత్రనాటకం. పెళ్లయ్యేవరకు

వొకతీరు అయింతర్వాత మరొకతీరు ... డబ్బుకాసించి కుటుంబం పాడిచేసుకునేవాళ్లు కొందరు, దొంగగామారి అరస్టయి భార్యాబిడ్డలకు దూరమయ్యేవాళ్లు కొందరు, యీవిధంగా తరగతులవారీగా తయారయింది మానవుల జీవితరంగం యేరోజుకి యెవరు యేవిధంగా తయారవుతారో యెవ్వరూ చెప్పలేరు కాలచక్రం తిరుగుతున్న కొద్దీ మహారాజు మట్టితట్టలు మోస్తాడు. మట్టితట్టలు పోసేకూలి మహారాజవుతాడు. మోసంచేసేవాళ్లకే యివి రోజులు. వాళ్లల్లో నేనొకణ్ణి. 'యదార్థవాది బంధువిరోధి' అన్నట్లు మోహనునిమాటలు వినక అతన్ని అనేకవిధాల దూషించాను. అగ్నిసాక్షిగా పెళ్లిచేసుకొన్న భార్యని మోసంచేసి ఆమెపట్ల పశువుగా ప్రవర్తించి పాపాన్ని యిరికించుకున్నాను. కన్నకొడుకుని కళ్లారాచూచి ఆనందించటానికికూడా అవకాశం లేకుండా అధోగతిపాలవవలసివచ్చింది. నేను యే మొహంపెట్టుకు యింటికి వెళ్లాలి? శారదని బాబుని యెలాచూడగలను. మహామారణ గుణాలవల్ల యింక వెర్రివాడుగా వీధులవెంట తిరగటం తప్ప వేరేమార్గం లేదు. నేను చేసినపాపానికి మొఖాసాపోయి ముట్టెత్తుకుంటున్నాను. హాహాహాహాహా... ఆకలిబాధ నన్ను ఆహుతిచేస్తోంది. (వొకవ్యక్తిని సమీపించి) బాబూ! బ్రతికి చెడ్డవాణ్ణి. పదిరోజుల్నుంచీ తిండిలేదు... దయ చూపించండి బాబూ! (అతను ధర్మంచేయకుండా వెళ్లిపోతాడు)

(16)

ఆత్మ:- నీచుడా! నీకాధర్మం!! ఎందుకు ధర్మంచేయాలి? నీకుధర్మంచేస్తే నీ పాతకం వాళ్లకూడా చుట్టుకుంటుంది. కన్నుగానక ప్రవర్తించేరోజున యీనాటిగతిని యెందుకు గుర్తించావుకాదూ? ఛీ- పాపీ! నీ విక్కడ బికారివై తిరుగుతున్నావు అక్కడ నీ భార్య, పిల్లడూ నీ కోసం కంటికి మంటికి యేకధారగా యేడుస్తూ కృంగి, కృళ్లి, నీరసించి నసించి పోతున్నారు.

సూర:- (తెల్లబోయి చూస్తూ నెమ్మదిగా) చేసినతప్పుకి నేనేం చేయను? వాళ్లకి నా మొహం యెలాచూపించను? (నెమ్మదిగా) నేనేంచేయను?

ఆత్మ:- ఇంకాయెంచేస్తావ్? నీకు సిగ్గులేదు. ప్రపంచంలో యేది మహా నేరమౌతుందో అదే నువ్వాచరించావు! నీవు యీభూమిమీద బ్రతికి వున్నంతకాలం నీ కుటుంబం నానా అగచాట్లకీ గురి కావలసిందే... అందుకునే ఫో! నీవాచరించిన అనాచారాలకి నీ ప్రాణాల్ని బలివ్వు. అంతకంటే నువ్వేంచేసినా నిన్నుచూసి లోకంసహించదు అప్పటికిగాని నీశారిదా బాబుల శోకాగ్ని చల్లారదు. పో! పో!! పో!!! (విషవునవ్వులు నాలుగు వైపులనుంచి వినబడుతూ వుంటాయి)

సూర:- (భయంతో గాబరాపడుతూ)పోతాను. నాప్రాణాల్ని లోకంలో జరిగే అత్యాచారాలకి అంకితం చేస్తాను. యిప్పుడే పోతాను. (గాబరాగా పోతాడు. తెరలో ముందు కారుహారను వినిపిస్తుంది. తర్వాత 'యాక్సిడెంటు

యాక్సిడెంటు' అని ప్రజలు కేకలు వేస్తారు. అనంతరం మోహన్ మరిద్దరి సహాయంతో సూరయ్యని తీసుకొస్తాడు. సూరయ్య కాలికుండా రక్తం కారుతూ వుంటుంది. బాధపడుతూ వుంటాడు)

మోహ:- (పరిశీలించి) ఆఁ! (ఆశ్చర్యంలో నెమ్మదిగా) సూరయ్యా! (పెద్దగా ఆత్రంతో) బావా!

సూర:- (బాధ పడుతూనే కళ్లు తెరిచి శూన్యంగా చూస్తూ) మోహన్!

మోహ:- (సూరయ్య దగ్గర కూర్చొని) చివరకు నా కారు క్రిందే పడ్డావా బావా!

సూర:- (తెల్లబోయి చూస్తూ) ఏమిటీ? నీ కారు క్రింద పడ్డానా? నువ్వేనా నా మీదనుంచి కారుపోనిచ్చింది? (బాధలోనే నవ్వి) మంచిపని చేశావు. మలినమైన నా జీవితానికి యీ నాడు యెంతో సుదినం. ఆదిలో నీ మాటలు వినక యిష్టంవచ్చినట్లు ప్రవర్తించినందుకు మంచిపని చేశావు. ప్రతిఫలంగా నామరూపాల్లేకుండా నాశనమవుతున్నాను. యీ నీచుడు యిలాంటి కఠినశిక్ష అనుభవించాల్సిందే. రౌరవాది మహానరకంలో రంపపు కోత కోయాల్సిందే కాని మోహన్! వొక్క కోరిక నేను చేసిన పొరపాట్లు నా ప్రాణాలు పోయాకైనా మీరు మర్చిపోతారు కాదూ! మర్చిపోతారు కాదూ!!

మోహ:- (విచారంగా) 'గతంనాస్తి' జరిగినవన్నీ మర్చిపో! అందుకు నేనేం బాధపడటంలేదు. నా సర్వ శక్తులు

వినియోగించయినా నిన్ను బ్రతికించుకుంటాను. నా సోదరి పసుపుకుంకుమకోసం నా ప్రాణాల్ని కూడా లెక్క చేయను. భయపడకు గావా!

సూర:- (గాఢగా) భయం. యెందుకు భయం? నాకు బ్రతుకు మీద ఆశేంటూ లేదు. అయినా నేను బ్రతికి యింకేవర్ని వుద్ధరిస్తాను? యీవిశాల ప్రపంచంలో నాలాంటి జీవివేసులు నశిస్తే నే కాని దుర్మార్గం నశించదు. అప్పటికిగాని అందరూ సన్మార్గులుకారు. అంతవరకూ అనాచారాలు ప్రబలమవుతూనే వుంటాయి. అందాకా యెన్నో కుటుంబాలు కూలిపోతూనే వుంటాయి. ఆ! యేదో ఆందోళన నా హృదయాంతరాళం అంతానిండిపోయింది అదే నన్ను యీచిత్రవధకి పురికొల్పింది. యిప్పటికి నాతప్పు నేను తెల్సుకొని పశ్చాత్తాప పడుతున్నాను. మోహాన్! కాని వొక్క కోరిక. నిన్ను ప్రాదేయపడి అడుగుతున్నాను. దిక్కులేని పక్షుల్లాగా అల్లాడే నా శారదని, బాబుని కాపాడే బాధ్యత నీది. (పొంగిపొర్లేదుఃఖంతో) వాళ్ళకి నువ్వుతప్ప వేరే దిక్కులేదు. వాళ్ళని నీకళ్ళల్లో పెట్టుకు కాపాడు. బాధ...బాధ (కాలుపట్టుకు బాధపడుతూ వుంటాడు)

మోహ:- (ఆదుర్దాగా) ఆలశ్యం చేయకండి. రండిబాబూ! కారుదాకా కాస్త సాయంపట్టండి. వెంటనే హాస్పటల్‌కి చేరుస్తే నే కాని లాభముండేట్టు కనిపించటల్లేదు. (యితరుల సహాయంతో సూరయ్యని యెత్తుకు తీసుకుపోతాడు. అనంతరం మధ్య వ్రేలాడకట్టిన తెర ప్రక్కకుతొలుగుతుంది.

కుక్కినులకమంచంమీద బాబు జ్వరంతో బాధపడుతూ వుంటాడు. శారద మంచందగ్గరకూర్చొని బాబుకి మందు అందిస్తూవుంటుంది.)

శార:-   ఇంతేనా మాబ్రతుకు
అంతా అగాధమేనా   ॥ఇంతే॥

యేనాటి పాపమోగా
యీనాడు అనుభవించ
దారేదిలేద యికనూ
మారేదిలేద బ్రతుకు   ॥ఇంతే॥

వినలేర వాకరుఅయిన
కనలేరా మదిలోబాధ
ఈపాపమే మొగానీ
మాపాలపడెనుకాదా   ॥ఇంతే॥

అగచాట్లుపడగ మాపై
పగబూనె లోకమంతా   ॥ఇంతే॥

బాబు:- (నీరసంగా) అమ్మా! నాన్నింకా రాలేదుటే?

శార:- వస్తారునాయనా. యీపూట తప్పకుండావస్తారు. నీకు జ్వరంగావుందని, తనకోసం బెంగపెట్టుకున్నావని వాళ్ళ వరదయ్యద్వారా ఖబురుచేశాను.

బాబు:- (నీరసంగా) వరదయ్య చెప్పాడోలేదో! నాన్న వస్తారోరారో!

శార:- తప్పకవస్తారు. రాకపోతే నేనన్నా వెళ్ళితీసుకొస్తాను.

బాబు:- వద్దమ్మా! నువ్వెళ్ళద్దు ... యిదివరకి వొకసారి నువ్వాక్కడికివెళ్తే నిన్ను కొట్టిందిగా పాడుముండ. మళ్లీ యెందుకు? నువ్వెళ్ళద్దు. కోపంతో నాన్నగారూ అదీ కలసి నిన్నేంచేసినాచెయ్యొచ్చు.

శార:- యేమీంచెయ్యరు నాయనా ... వొకవేళ చేసినా నీకంటే అవన్నీ నాకు యెక్కువానాయనా? ఆ బాధలు అనుభవించయినా ఆయన్ని తీసుకొస్తాను.

బాబు :- నాలుక పిడచకట్టుకుపోతోందే...(నెమ్మదిగా లేవ బోతూ తెల్లబోయిచూసి) అమ్మా! ఎవరేవాళ్లూ?

శార:- ఎవరున్నారు (అటూయిటూచూసి) యెవ్వరూ లేరే!

బాబు:- కనిపించటల్లేదూ? నల్లగా, బారుగా, బుర్రమీసా లతో, వికృతంగా రాక్షసరూపంలో, కత్తులుపుచ్చుకు యిటేవస్తున్నారు. ఆ! దగ్గరకివచ్చారు (భయపడి కళ్లు మూసుకుంటూ) రావద్దు...నాదగ్గరకురావద్దు వెళ్లండి.

శార:- రారులేబాబూ! భయంలేదు. నామాటవిని పడుకో.

బాబు:- అదేమిటే అలాఅంటావ్? వాళ్లు నా మంచంచుట్టూ కత్తులుపుచ్చుకుతిరుగుతున్నారు. నన్ను రమ్మంటున్నారు' రాకపోతే నరుకుతానంటున్నారు.

శార:- లేదునాయనా యెవ్వరూలేరు. కళ్లుమూసుకుపడుకో.

బాబు:- మరి నాన్న యెప్పుడొస్తారు?

శార:- వస్తారు. నువ్వు నిద్రపోతేనేగాని రారుట.

బాబు:- (మరోప్రక్క చూస్తూ) అమ్మోయ్! అటుచూడు. పిల్లిని పులి తింటోంది. కప్పని పాము తింటోంది. పాముని గద్ద తన్నుకుపోతోంది గద్దకాళ్ళక్రిందవున్న పామువంక ముంగీసు క్రిందనుంచి నోరు తెరచుకు చూస్తోందిఎందుకో. ఆశగాచూస్తోంది. కోరగాచూస్తోంది. (మరోప్రక్కకు చూసి) ఆఁ! ఆరాక్షసులుకూడా ముంగీసులాగా నోరు తెరుచుకు నావంక చూస్తున్నారేవ్ ... నాన్నగారన్నావస్తే ఆ రాక్షసుల్ని తరిమేస్తారు... నేనురాకపోతే కట్టేసి తీసుకుపోతామంటున్నారు.నన్ను విడిచిపెట్టి వెళ్ళనంటున్నారు.

శార:- మాబాబుకాదూ! కళ్ళుమూసుకుపడుకోపోతే నాకు కోపంవస్తుంది.

బాబు:- అలాగే పడుకుంటానమ్మా! (తల్లిని పరిశీలించి) అన్నం తినలేదామ్మా? బియ్యంలేవా? నేను నెమ్మదిగా వెళ్ళి పాలిష్ చేసి సంపాదించుకురానా?

శార:- వద్దుబాబూ! అన్నంతిన్నాను. నువ్వు పడుకో. పడుకోపోతే నామీదవొట్టే.

బాబు:- పడుకుంటాలేవేమ్మా...వళ్ళంతా మంటలుగావుంది. నీ చల్లనిచేత్తో వళ్ళంతా రాయవే. మంటలుతగ్గితే నిద్దరొస్తుంది.

శార:- అల్లాగే! కళ్ళుమూసుకు నిద్రపో. (అని వళ్ళు చేత్తో వెన్నుమీద రాస్తూవుంటుంది. డాక్టర్ ప్రవేశిస్తాడు)

డాక్ట:- ఎలాగుందమ్మాయి అబ్బాయికి?

శార:- (ఆదుర్దాగా లేచివచ్చి డాక్టరుగారూ! యెప్పటిలాగే వుంది. యీవేళ అధికంగా క్షణక్షణానికి పిచ్చిమాటలు మాట్లాడుతున్నాడు.

డాక్ట:- జ్వరంలో పైత్యం జాస్తీఅయితే పిచ్చిమాటలు వస్తూవుంటాయి ... తొందరలో జాగ్రత్తతీసుకోపోయి, టెంపరేచర్ రైజయిందంటే అదే సంధిక్రిందికి మారుతుంది.

శార:- (తెల్లబోయిచూస్తూ) ఆఁ!

డాక్ట:- ఆఁ మరేమనుకున్నావు? ఆజబ్బు అలాంటిది. అందుకే ఘాటైన యింజక్షన్ వ్రాసిచ్చాను. తీసుకొచ్చావామరి? అదిమాత్రం శూన్యం ... మందులేకుండా రోగం నయం చేయటం మావశంఅవుతుందా? నావల్లకాదు సరికదా డాక్టరుగా జీవించే యే వక్కడివల్లాకాదు.

శార:- (విచారంగా) డాక్టరుగారూ! వారింకారాలేదు. చేతిలోనా కానీలేదు. వారు యింటికిరాగానే మీకివ్వావలసిన పైకం అంతా యిప్పిస్తాను. యేదో సహాయం చేయండి డాక్టరుగారూ!

డాక్ట:- (హేళనగా) వారు వస్తారు నువ్విప్పిస్తావు ... అన్నీ నిజమే.

శార:- సాయంచేయండి డాక్టరుగారూ!

డాక్ట:- (విసుగుతో) సాయం! సాయం!! సాయం!!! రోగం వచ్చిన ప్రతివాడు సాయంచేయమంటే, మందులెక్క-

ణ్ణించి తెస్తాం? అదీగాక మేంబ్రతికేదెలాగు? మందుల షాపులవాళ్లు బ్రతికేదెలాగు? మాట మాట్లాడేటప్పుడు కాస్త ఆలోచించి మాట్లాడాలి. 'కోటివిద్యలు కూటికొరకేనని' యెంతడబ్బో తగలేసి యింతచదువుచదివి డాక్టరయిందియెందుకు? పెళ్లాంబిడ్డల్ని పోషించుకోటానికేనా? వుచితవైద్యశాల స్థాపించి వుపవాసాలుచేయటానికా?

శార:- బీదవాళ్ళంటే ఆపాటిదయచూపలేరా డాక్టరుగారూ!

డాక్ట:- మాకు వెనకాల పిత్రార్జితంపడి మూలుగుతూవుంటే బీదవాళ్లకేమిటి అందరికీవరస పెట్టిసాయంచేసేవాణ్ణే. అదా లేదు. 'రెక్కాడితేనేగా డొక్కాడదు' మరోవిషయం. మందులూ మాకులూ, మాకెక్కడన్నా వుచితార్థంగా వస్తూవుంటే కావలసినంత దయచూపిస్తాం. అప్పటికీ పూర్వంనుంచివున్న అభిమానంకొద్దీ రాగికాసీ పుచ్చుకోకుండా రోజూ వస్తూనేవున్నాను. రోగిని చూస్తూనే వున్నాను. యింకా మందులుకూడా నన్నే తెమ్మంటే ఎక్కణ్ణుంచి తెచ్చేది? నామాటవిని కుర్రాడు ప్రమాదం నుంచి తప్పించుకు బయటపడాలంటే తంటాలుపడి ఎక్కడన్నా పదిరూపాయలు పట్టుకురా.

శార:- యెక్కణ్ణుంచి తెమ్మంటారు?

డాక్ట:- అదీ నేనేచెప్పనా! ఇలాంటికేసులు నెలకు నాలుగు వస్తేచాలు ... మాకు సంపాదన యెక్కువై ప్రాక్టీసుకి స్వస్తిచెప్పచ్చు.

బాబు:- (బాధగా) అమ్మా! నాన్నని యెవరో కట్టేసి తీసుకుపోతున్నారే.

శార:- (సమీపించి) లేదునాయనా పడుకో. (దుప్పటి ముసుగుపెట్టి తిరిగి డాక్టరుదగ్గరకువచ్చి) చచ్చి మీ కడుపున పుడతాను డాక్టరుగారూ! నాబాబుని రక్షించి వాడికి ప్రాణభిక్షపెట్టండి. కావాలంటే మీబాకీ తీరేవరకూ మీయింట్లో దాసీపనిచేస్తాను.

డాక్ట:- ప్రయోజనంలేనిమాటల్తో పనిలేదు ... మాయింట్లో ముగ్గురు దాసీలున్నారు...వాళ్ళే సరిగా పన్లులేక తేరతిండితిని కూర్చొంటున్నారు. నాల్గోదానివి నువ్వుకూడా ఎందుకు? యెన్నిసార్లుచెప్పినా నీమనస్సుకి యెక్కటల్లేదు. కేసుచూస్తే చాలా ప్రమాదమైనది. డబ్బా నీదగ్గరలేదు. అది సంపాదించేమార్గం ఆలోచించుకొని తీసుకురా అంతే.

శార:- బీదవాళ్ళమీద...

డాక్ట:- కాబట్టే పదిరూపాయలతో పనిముగిద్దాం అనుకుంటున్నా...యీలాంటిజబ్బే భగవంతునిదయవల్ల ధనికునికి రావాలీ దర్జాగా వందలుగుంజుతాను. 'ధనమూల మితం జగత్' అన్నారు. అందుకే అసలులేకుండా పనిజరపటం అసంభవం.

బాబు:- (నీరసంగా తలపైకెత్తి వెర్రిగాచూస్తూ) అమ్మా! యిందాకటి రాక్షసులే మళ్ళీ కత్తులుపెట్టి పొడుస్తానంటూ నాచుట్టూతిరిగి నన్ను ఝుడిపిస్తున్నారే. నన్ను రమ్మంటున్నారు. వెళ్ళనా?

శార:- (ఆదుర్దాగా సమీపించి) వద్దుబాబూ వద్దు మందిపిస్తాను.

బాబు:- మరి మానాన్నగార్ని తీసుకురావూ ?

శార:- తీసుకొస్తాను.

బాబు:- పోనీ మామయ్యని పంపించరాదూ ? మామయ్య రాజమండ్రినుంచి వచ్చాడా ?

శార:- లేదు. కనీసం వుత్తరంరాయించటానికైనా కార్డు దొరకలేదు.

డాక్ట:- మూడుకాన్లు పారేస్తే పోస్టాఫీసులో యెన్నికావలిస్తే అన్ని దొరుకుతాయ్. వాటికింకా కంట్రోలురాలేదు.

బాబు:- అమ్మా! యింక బ్రతికేటట్టులేనే వళ్ళంతామంటలు.

శార:- డాక్టరుగారూ!(సమీపించి)జ్వరంఎంతుందోచూడండి.

డాక్ట:- దానికేం ధర్మామీటరు మనచేతిలోదేకాబట్టి దానికి ఫీజుతోపనిలేదు.

శార:- (ఆదుర్దాగా)చూడండి డాక్టరుగారూ !

డాక్ట:- (సమీపించి బాబునోట్లో ధర్మామీటరు వుంచుతాడు) రోజులు చాలా గడ్డుగావున్నాయ్ ... ప్రారంభంలో డాక్టరు రోగిని పరీక్షచేసినందుకని అయిదురూపాయలు తీసుకుంటాడు. తర్వాత మందు ప్రారంభించాక, రోగి లేచితిరిగేసరికి యెన్నోవందలు గుంజుకుంటాడు. ప్రాక్టీసు మొదలుపెట్టినదగ్గరనుంచీ మీయింట్లో వైద్యం చేస్తు

న్నాను. పరీక్షకని, బండీకని, యింటికివచ్చినందుకని ఫీజులు వేరువేరుగా తీసుకుంటున్నానా? దీన్నిబట్టి ఆలోచించు యితరడాక్టర్లకీ నాకూ ఎంత బేధంవుందో. (ధర్మామీటరుచూసి) హైఫీవరు. హండ్రెడ్ అండ్ ఫోర్ అంటే నూటనాలుగుడిగ్రీలు జ్వరంవుంది. అమ్మాయ్! కాసిని నీళ్ళుందుకో. (శారద నీళ్లు తెస్తుంది. ధర్మామీటరు కడిగి జేబూలో పెడుతూ) రోగం ప్రమాదమైనస్థితిలో వుందని గుర్తించలేకపోతున్నావు ... డబ్బులేదని ఆలోచిస్తే ముందు ప్రాణానికే మోసంవచ్చేటట్లుంది. తండ్రికోసం మనోవ్యాధి యెక్కువయింది. అసలు మనోవ్యాధికి మందుండదంటారు. నేనుకాబట్టి మొండికేసి కేసు బాగు చేస్తానంటున్నా మరొకడాక్టరయితే వందలిచ్చినా యీ కేసుని టేకప్ చెయ్యడు ... ముందు డబ్బుకోసం ప్రయత్నంచెయ్.

శార:- డాక్టర్ గారూ! బాబు పరిస్థితి యేమీబాగుల్లేదు.

డాక్ట:- అదేగా నేనుచెప్పేదీను.

శార:- దయచూపలేరా డాక్టరుగారూ!

డాక్ట:- అమ్మాయ్! వొక్కనాలికకలవాళ్ళకి వొక్కటే మాట. యిన్నిమాటలుగావు. డబ్బులేందే పనిజరగదు! పనిజరగదు!! ముమ్మాటికి ప - ని - జ - ర - గ - దు.

శార:- ఆఁ! (తెల్లబోయి డాక్టర్ని చూస్తుంది)

బాబు:- (వొక్కసారి పెద్దగా కేకపెట్టి) అమ్మా! వళ్ళంతా మంటలు... కాళ్లూ వేళ్లూ మెలికలుతిరిగిపోతున్నాయే.

శార:- (ఆవేదినతో కంగారుగా బాబునిచూసి) డాక్టరు గారూ! బాబు నా యేకైకపుత్రుడు. వాడు నాహృదయ కుసుమం...వాడు నాజీవితలక్ష్యం...మీరుదయగల ధర్మ దాతలని నాకు పుత్రభిక్ష పెడ్తారని యెంతో ఆసించాను. ఆ ఆశ అక్కడే ఆగిపోవాలా? ర క్తం ప్రవహించక శరీరం కొయ్యబారి కొంగర్లుపోతున్నా మీకు దయగలగ లేదా? డాక్టరుగారూ!

డాక్ట:- (నిర్లక్ష్యంగా) మానవసంఘంలో యిది సహజమే... డబ్బుఅనేసరికి యిలాంటిపలుకులు రావటం. 'తాతకి దగ్గు నేర్పుతానంటే' ఎలా? ఎక్కడన్నా అప్పోసప్పోచేసి తీసుకురా.

శార:- అప్పుపుట్టలేదు...వారుయింటికిరావటల్లేదు...ఇంట్లో కానీలేదు.

డాక్ట:- ప్రాణంకంటే యెక్కువా? మెళ్లో మంగళసూత్రం అమ్మి తీసుకొచ్చి నీ కొడుకుని బ్రతికించుకో.

శార:- (తెల్లబోయిచూస్తూ నెమ్మదిగా) మంగళసూత్రం అమ్మనా? మంగళసూత్రం అమ్మనా? (డాక్టర్ని కోపంగా చూస్తూ సమీపించి) నీది గుండెకాదు రాతిబండ. పేద వాళ్లంటే దయాదాక్షిణ్యాం చూపలేని ధనపిశాచివి. దిక్కులేక ప్రాణాల్ని మూటకట్టుకు మంచంలో పడివున్న అనాధ బిడ్డని బ్రతికిస్తే నీ అయిశ్వర్యమంతా తరిగి

పోతుందా లోకం మీకోసం మీరు లోకంకోసం సృష్టించ బడ్డారు. అంతేనా? అవును...అంతే! మాలాంటి బీద వాళ్ళకి ప్రపంచంలో నిలవటానికి నీడలేదు. వాళ్ళకి మాట్లాట్టానికి హక్కులేదు... మేము కూటికిలేని కటికిదరి ద్రులంకాబట్టి డబ్బిస్తేనేగాని వీల్లేదన్నావు...అంతవరకు మందుయివ్వనన్నావు...అదే మరో నీలాంటి ధనపిశాచి అయితే ఆమాట అనగలవా? అని యీ వూళ్లో డాక్టర్ వృత్తి చేయగలవా? డబ్బున్నవాడినే పొగడుతుంది. వాడికే దాసోహంచేస్తుంది లోకం. ధనికుల దౌర్జన్యం, వాళ్లాచరించే నీచాతినీచాలు పేదవాళ్ళమీదకే పరుగెత్తు తాయ్. నాభర్త దగ్గరలేనప్పుడు నన్ను మంగళసూత్రం అమ్మి తెమ్మంటానికి నీకు నోరెలావచ్చింది?

బాబు:- (పెద్దగా 'అమ్మా' కేకపెడ్తాడు) నాన్న (అంటూ వెర్రిగా అంటాడు)

శార:- (కంగారుగా కాళ్లుపుచ్చుకొని) డాక్టరుగారూ! నా బాబుని బ్రతికించండి ... తల్లిప్రేమని యిప్పటికైనా తెల్సుకోండి. డాక్టరుగారు!

డాక్ట:- (రెండడుగులు వెనక్కివేసి) నన్ను బాధబెట్టి నువ్వూ బాధపడటమేగాని ఫలితంలేదు. త్రాగటానికి మంచినీ ళ్ళన్నా యింట్లో వున్నాయోలేవో. నీమాటల్తో మనస్సు మారి మందిస్తానన్నమాట మర్చిపో...నువ్వు నన్ను యెంతతూలనాడినా నేను అవ్వేమి లెక్కచేయను... మాకు కావలిసింది డబ్బు. అందుకే యీ వ్యాపారం...

వ్యాపార స్తుతికి మొహమాటం వుండకూడదు. దయ అనే దాన్ని దగ్గర కేరానియ్యాను. అందుకోసం నువ్వెంత ప్రాధేయపడ్డా ప్రయోజనమూ లేదు. నేనింకా నాలుగు యిళ్ళకి పోవలసినవాణ్ణి. వొక్కచో టేవుండే పొట్టగడవదు. నేను పోతున్నాను. యెలాగో అలా డబ్బు సంపాదించి మాయింటికి తీసుకొచ్చి నా చేతిలో పెడ్తేనే యికమీద యిక్కడికి వచ్చి కేసు బాగుచేస్తాను. లేకపోతే లేదు ... రోగం మాత్రం చాలా ప్రమాదమైనదని వుచితంగా సలహా యిస్తున్నాను. (వెళ్ళబోతాడు)

శార:- (విచారాన్ని కోపంగామార్చుకొని పెద్దగా) ఆగు! (అడ్డునిలబడి) మాతృహృదయం తెలియని మహమ్మారి! యెక్కడికివెడతావ్ ? కాళ్లావేళ్లాపడి బ్రతిమిలాడినా నీ మనస్సు మారలేదు. నీది హృదయంకాదు. నాబాబుకి మందివ్వకుండా అడుగు ముందుకువేశావా నీ ప్రాణాలే నీకుదక్కవు. (వెర్రిగాచూస్తుంది)

డాక్ట:- (లోపల భయపడుతూ, మాట తడబడుతూ) డబాయించి పనిచేయిస్తావా ?

శార:- అవును మంచితనంమీద యెన్నోవిధాలా బ్రతిమిలాడాను. నీయింట్లో దాసీగావుంటాననన్నాను. నీకడుపున పుడతానన్నాను. అన్నిటికి 'ససేమిరా' అన్నావ్. మంచంలో మ్రగ్గిపోతున్న నా బాబుని విడిచి ముందడుగు వేయటానికి నీమనస్సు యెలావచ్చింది? యెలా వెడతావ్? నీ ప్రాణాలమీద నీకు ఆశ ఆనేదుంటే ముందు మందిచ్చి

కదులు. (పెద్దగా) ఊఁ! (స్థాయి బాగా పెంచి) ముందు మందివ్వు. నాకు కావలసింది నాబాబుబ్రతకటం. నీబ్రతుకుతో యీ స్తితిలో నాకు పనిలేదు. మంచిమందిచ్చి కాపాడకపోతే ప్రాణాలు మూటకట్టుకోవలసివస్తుంది. జాగ్రత్త.

డాక్ట:- (నిట్టూర్చి హేండ్‌కర్చీఫ్‌తో మొహాన చెమటని తుడ్చుకుంటూ ఆలోచించి) సరె. ఆనక అయిదుగంటలికి యింజక్షన్ యిస్తాను. డబ్బు తర్వాత మీాదయవుంటే యిద్దురుగాని లేకపోతేలేదు. నాతోరా మా యింటికి మందిస్తాను.

శార:- ఆఁ! (కోపం సంతోషంగామార్చుకొని) వస్తాను డాక్టరుగారూ వస్తాను...బాబూ! (బాబుని సమీాపించి యేదో సర్దుతూవుంటుంది)

డాక్ట:- 'వెయ్యేక వెయ్యేక కన్నంవేస్తే మంగలం దొరికినట్లు' యీాయింటికి రావటమేమిటి? డబ్బులేనిబేరం. ముందు వెనకలు ఆలోచించకుండా వూటకి ఠికానాలేని పేదవాళ్ళింటికి రావటమే ప్రథమతప్పు. వచ్చాక వాళ్ళకి తలవంచి తీరాల్చిందే. కాకపోతే యిలాగే తయారవుతుంది. రామమ్మాయ్! ప్రమాదమైన రోగం. మందిస్తాను. త్వరగావస్తావుకదూ? (బయటకు వెళ్తాడు)

శార:- బాబూ! మందుతీసుకొస్తాను. కాస్సేపు కళ్ళుమూసుకు పడుకుంటావుకదూ?

బాబు:- అమ్మా! నాకేమిటో భయంగావుంది. నన్ను ముళ్ల కంచిల్లోకి త్రోస్తున్నారు.

శార:- లేదునాయనా. యిక్కడ యెవ్వరూలేరు. పడుకో బాబూ!

బాబు:- (నీరసంగా) అమ్మా! దాహంగావుందే.

శార:- (మంచినీళ్లు అందిస్తుంది)

బాబు:- (త్రాగి) అమ్మా! నాకోసం యెందుకే అంత శ్రమ పడతావు. డాక్టరుగారు రానన్నారా?

శార:- వచ్చి చూచివెళ్లారు. మందుకి రమ్మనిచెప్పారు. వెళ్లొస్తాను.

బాబు:- వద్దమ్మా. శ్రమకు తగిన ఫలితంలేదు...నే...ను బ్ర...త...క...ను. నాకు వున్నదల్లా వొక్కటేకోరిక, (అతినీరసంగా) నాన్నని చూడాలని...అమ్మా! నాన్నని చూ...డ...లే...న్నా...మ్మా... అన్నం వండటానికి నీళ్లువున్నాయికాని బియ్యంలేవమ్మా...నాన్నని...

శార:- చూస్తావునాయనా!

బాబు:- (అటూయిటూ తెల్లబోయిచూస్తూ నీరసంగా) ఎప్పుడు చూస్తాను?

శార:- ఈవ్వేళ తప్పకుండావస్తారు.

బాబు:- రారు. అది నాకు తెలుసు. నన్నెవరో పట్టుకుపీకు తున్నారు. ఆఁ! అదిగో నాన్నని పట్టుగుకొడుతున్నారు. యింటికిరమ్మని తీసుకురావే. ఆఁ! (అంటూలేవబోతాడు)

శార:- (ఆపి) నువ్వు లేవకు. మీనాన్న యింటికి వస్తా నన్నారు. యీపాటికి వస్తూవుంటారు.

బాబు:- ఎవరితో ? అంతావట్టిదే. ఆయన రారు. రావాలని వున్నా వాళ్లు రానీయరు. అటుచూడు నాన్న చేతిలో కారప్పూసపొట్లం గద్దతన్నుకుపోతోంది. మళ్ళీఆపొట్లాం ఎట్లావస్తుందే. నేను గద్దనుకొట్టి తీసుకురానా ? (పిచ్చిగా చూస్తాడు. పడుకుంటాడు)

శార:- (గాబరాగా) బాబూ! బాబూ!! ఆఁ! మాట్లాడవేం? (ఆత్రంగా) బాబూ! బాబూ!!

బాబు:- (నెమ్మదిగానవ్వి) బా...బు...ప...ని...అ... యి...పో...యిం...ద...మ్మా ... నా ... న్న ... ని యిం...క...చూ డ లే ను. నా న్న కి నా న మ స్కా రం చె...(ప్రాణం విడుస్తాడు)

శార:- (పెద్దగా) బాబూ! (మీదపడి యేడుస్తుంది) అప్పుడే నీకు నూరేళ్లూ నిండాయా నాయనా ? బ్రతికిన నాల్గు రోజులూ యేమనుభవించావుబాబూ. తిండికి మొహం వాచి, తండ్రికి దూరమై, కష్టాలకోర్చి శాశ్వతంగా కళ్ళు మూశావా ? నీచమైన ఆచారాలకి దాసోహంచేసే యీ కాలంలో మనలాంటి దరిద్రులు బ్రతకలేరు. వాళ్ళు వుండ టానికి స్తానంలేదు. పేదవాళ్ళంటే ప్రపంచానికే గిట్టదు. వాళ్ళనిచూస్తే ప్రపంచం వికటాట్టహాసం చేస్తుంది. యీనాటివరకూ నిన్నుచూశనా సంతోషిస్తున్నాను. నేటితో ఆ ఆశకూడా నీటకలిసిపోయింది. అవసానదశలో

మీనాన్న, నువ్వూ, వొకరినొకరు కంటితోచూడటానికి కూడా రుణంలేకపోయింది. నువ్వే మా జీవితకుసుమమని యెంతో వృద్ధిలోకివస్తావని ఆసించాను. ఆ ఆశ దురాశగామారి నిరాశయింది. నాకింకి లోకంలో దిక్కెవ్వరు? నే నెవర్నిచూసి సంతోషించేది? నా ఆశలు యేవిధంగా నెర వేర్చుకునేది? బాబూ! (మీందపడి యేడుస్తుంది. వాయిద్యాలవారు విషాదగీతికను వాయిస్తూవుంటారు. బాబుని రెండు చేతులతోనూ పైకెత్తి వెఱ్రిగా నవ్వి) నాయనా! పెంచి పెద్దచేయవలసిన యీ చేతుల్తో ఆఖరికి దానికి బదులు దహనక్రియలు జరిపిస్తున్నావా?... యీ స్తితిలో మనకి సాయంచేశేవాళ్లు లేరునాయనా. నిన్ను మట్టి చేయూవల్సిన బాధ్యత నీ మాతృదేవిమీాదే వుంది. నాయనా (విచారంతో నెమ్మదిగా బాబునితీసుకు పోతుంది. తెర నెమ్మదిగా జారుతుంది)

— తెర —

# పెళ్ళియ్యాక చూడు

## 5 వ రంగము

[శివపాదం సిగరెట్టుకాలుస్తూ ప్రవేశించి యేదో ఆలోచిస్తూ వుంటాడు ...మరోపైపునుంచి రాముడు కూరకాయలసంచి చేతపట్టుకు శివపాదాన్ని చూడకుండానే పోతూవుంటాడు.]

శివ:– (లేచి) రాముడూ !

రాము:– (వెనక్కితిరిగి) ఎందుకు ? (నోసళ్ళు చిట్లిస్తాడు)

శివ:– (సమీపిస్తూ) మనలోమనమాట నీకూ్కడా నామీ దంత కోపంవుంటే నేనెలా బ్రతికేదిరా ?

రాము:– బతక్కపోతే సచ్చిపోండి. దానికి నానేటి శేయను ? శివపాదంగోరూ ! యదవని నానొక్కటే శెపుతున్నాను. మీాయిసయంలో అంటించుగున్నంత బుద్ధిపొరపాటు యింకోటి నేదు.

శివ:– మనలోమనమాట వొకసారి పొరపాటుజరిగిందని యెప్పుడూ జరుగుతుందా ? యీాసారి చాలా జాగ్రత్తగా వుంటాను. నువు సచ్చినంతొట్టు.

రాము:– యదవని నానుసత్తే మీాకేం ? నాపెళ్లి మేడ స్తుంది అనకూడదుకానీ, అసలు మీారు ఆడంగి రేకోరు.

శివ:– ఆడంగి రేకివాణ్ణా ?

రాము:- కాదంటారా? మీసంగలమొగోరయితే మీ ఆడోళ్లు యిట్టా ఆపితారా?

శివ:- అందుకేగా మనలోమనమాట యిట్టాయేడవటం. అదే మిటో యెంతిమందినన్నా వంచానుకాని, మాఆవిణ్ణి వంచటం నాకు చేతకాలేదు. పోనీ దానికి యిష్టంలేన ప్పుడు, అకక్కడికిపోకుండా మనస్సుమార్చుకుందామంటే, ఆపని చేయలేకుండావున్నాను. మనలోమనమాట మర్చి పోదామన్నా మరుపురావటల్లేదురా. తినే అన్నంలోనూ త్రాగే నీటిలోనూకూడా అదేకనిపిస్తుంటే యేంచచ్చే దిరా? చూడు సూరయ్యాని వెళ్లగొట్టిందిగా. కాస్త...

రాము:- సందిశేయమంటారా? నావల్లకాదు. సూరయ్యా నెల్లగొడ్తే ఆడిబాబు బద్రయ్యా సట్టుకుంది. మరి యెట్టా శెప్పండి మీ యిద్దరికీ కుదిలేది? అదేటికర్మమో మీారంటేనే రోత.

శివ:- ఆ రోతే నా హృదయంలో కోతకోస్తోందిరా. నేనెలా బ్రతికేనురా?

రాము:- బతికపోతే సచ్చిపొండి కిష్ట నిండావుందంట. ఆమా టంటే జాలిపుడుద్ది అనుకుంటారేమో. అసలే లాబంనేదు. యదవని నన్నడుగుతే యిట్టా యేడుత్తూవులడేకంటే సావటమే సక్కగావుంటుందంట. ఆ మంచిశెడ్డలు కీరితి ఆయమ్మకే మిగిలుంటాయి.

శివ:- నీమాటప్రకారం చేద్దామనుకున్నా మనలోమాట యితరులు చస్తుంటేనే చూళ్లేనే నాకునేను చూస్తూ చూస్తూ యెలాచచ్చేది? మనస్సెట్లా వప్పుతుంది?

(21)

రాము:- అందుకు నానేటిశేయనండి? పొరపాటునన్నా ఆవిడగోరు మీపేరు తలవరుకండా యెట్టాశెప్పేది? వాకేల శెప్తామనుకుండా, అస్తమానం ఆ బద్రయ్య గోరితో సినిమాలకి, సికార్లకీ యెల్లానే కాలంగడిపేత్తుంటే, యీాలయేదెట్టా! దానికితోడు నాకు వృద్దవాసం శెప్పేత్తుందేమోని భయం.

శివ:- అయితే నాఖర్మ యింతేనటరా?

రాము:- (విసుగుతో) అంతో యింతో ఆవిడగోర్ని అడగండి.

శివ:- (గుండెలమీద చెయివేసుకు భయంతో) అమ్మయ్యో! దాన్నే! మనలోమనమాట కాలుసాగద్దూ?

రాము:- (నవ్వి) అడగటానికే అంతబయమయితే అసలెం దుకుపనికొత్తారండీ మీరు?

శివ:- (ఏడుపు మొహంపెట్టి) యిట్లాయేడవటానికి. రాముడూ! నాకు సాయంచేస్తే నువ్వేచెయ్యాలి. నువ్వుకాదంటే దాన్ని చంపి నేను చస్తాను. (కళ్ళనీళ్ళు తుడుచుకుంటాడు)

రాము:- (నవ్వి) మాటకామట్టె ఆలోసింసకుండా అనేసినోరు. యెల్లి అడగటానికే కాలాడంది, సంపటానికి శెయ్యాడు ద్దంటండీ?

శివ:- అరేయ్ రాముడూ! శివపాదం యెలాంటివాడో నువ్వెరగవు. మనలోమనమాట (యీర్ష్యగా) నామాట నిజంగా కాదనాలీ...

రాము:- యిప్పుడపద్దంగా అంటున్నావేటి? నిజంగానే అంటుండారు.

శివ:- అదికాదు. యీసారివెళ్ళి అడిగినప్పుడనాలి ఆమాట- సినిమాల్లో హీరోలాగ నటిస్తాను. ప్రాధేయపడి అడుగుతున్నానని, తాను అంగీకరించకపోతే యే నట్టేట్లోనో దూకుతానని, యికముందు పల్లెత్తుమాట అననని, తన స్వేచ్ఛాజీవితానికి అడ్డురానని, చెప్పి, తెంపిపారేసిన పుస్తిని క్రొత్తతాడుతో కట్టుకొని తిరిగి నన్ను భర్తగా స్వీకరించమని బ్రతిమిలాడుతాను. ప్రమాణంచేస్తాను.

రాము:- ఆదెబ్బతో యిరుగుపొరుగేటంటుందో తెల్సా? పెళ్ళాందగ్గిర పిల్లని...

శివ:- మనలోమనమాట యిప్పుడనటంలేదుకనుకనా? వాళ్ళ- యిరుగుపొరుగేమిటి? మెడకాయమీద తలకాయున్న ప్రతివాడూ అంటున్నాడు. మనలోమనమాట అవన్నీ మనం పాటిస్తామా?

రాము:- అంతేనా? ఆడదాని శేతికూడుతింటం అచ్చేపన కాదూ?

శివ:- మనలోమనమాట అందులో కొత్తేముంది? అందరూ అంతేగా. అన్నంవండేది ఆడవాళ్లు. తినేది మగవాళ్లు. ప్రభుత్వంమారితే యిదికూడా మారుతుందేమో ... అందాకాయింతే! యీమాటలు యెవడో నీలాంటి సోమ

రిపోతనాలిగాని ఆడవాళ్ళతో కాపరంచేశేవాళ్ళెవరూ అవరు.

రాము:- అనరూ? సూత్తారుగా?

శివ:- అనేమాటలు వింటారుగాని సూట్టమేమిట్రా నీమొహం మనలోమనమాట నీకొక రహశ్యం చెప్పనా?

రాము:- శెప్పండీ!

శివ:- మనలోమనమాట నేను పెళ్ళిడింది ప్రపంచంకోసమా? నాకోసమా?

రాము:- మీకోసమేన్నాయానికి...పపంచకంకోసమని అనుకుంటుండారు ప్రజలు...

శివ:- (కోపంతో) ఆఁ! నువ్వా అదేమాటంటున్నావురా?

రాము:- అదుపులో పెట్టుకోపోతే అన్నా? యదవని నానేంటి అందరూ అంటారు.

శివ:- ప్రపంచకంలో పెళ్ళాన్ని అదుపులో పెట్టలేకపోవటం వొక తరగతి.

రాము:- (ఆశ్చర్యంగా) తరగతీ! అదేటి?

శివ:- మనలోమనమాట పెళ్ళయ్యాకచూడు. పెళ్ళాన్ని అదుపులోపెట్టేవాళ్ళు 'A' క్లాసు మనిష్యులు — భార్య అడుగుజాడల్లోనడిచే ఘరానా పెద్దమనుష్యులు 'B' క్లాసువాళ్ళు లగ్నంఅయినమర్నాడు యే కట్నంకాడో పేచీవచ్చి పెళ్లాన్ని విడిచిపెట్టేవాళ్ళు 'C' క్లాసు మనుష్యులు —

పెళ్లం చెడ్డగా ప్రవర్తిస్తుంటే, యేమీ అనలేక, భయంతో చూసీచూడకుండా కాలంగడపాలని ప్రయత్నించే నాలాంటి సత్పురుషులు 'D' క్లాసుపీపులు — కట్టుకున్న భార్యుండగా కన్నుచెదిరి పరాయి వాళ్ల భార్యలకోసం ప్రాకులాడేవారు 'E' క్లాసు పీపులు — పెళ్లంబిడ్డలకి తిండిపెట్టలేక పరాయిదేశాలు పారిపోయి పిచ్చివాడులాగా తిరిగేవాళ్లు 'F' క్లాసు పెద్దమనుష్యులు. మనలోమనమాట యిలా వరసగా 'A' మొదలు XYZ వరకు తరగతులుగా విభజింపబడ్డాయి. మానవజీవితాలు ప్రతివాడూ యేదోవొక క్లాసుకి చెందివుండాల్సిందే. యిందులో నువ్వేక్లాసుకిచెందుతావో చెప్పు.

రాము:- (విసుగుతో) యేటేటో సదివారుగాని అయ్యోటీ యదవని నాకద్దముకాలా అయ్యోటో మీరేసూసుకోండి. (వెళ్ళబోతూవుంటాడు)

శివ:- రాముడూ! (రెక్కపట్టుగుఆపి) మాటలసందర్భంలో అసలుమాటే మర్చాను. సావిత్రితో యేకాంతంగా పది నిమిషాలు మాట్లాడాలంటే యెప్పుడువీలవుతుందో చెప్పు. మనలోమనమాట పరాయిపురుగు వుండనివేళ చెప్పు.

రాము:- అది నేనెట్టాశెప్పను? నాకు తెల్దు. తీర ఆడకెళ్లాక అమ్మగోరు వోరుశెప్తారంటే రాముడని యెట్టాగూ అంటారు. మనపని ఆ దెబ్బతో కాళీఅయిపోద్ది. నాకెందుకు నానుపోతాను. (వెళ్ళబోతాడు)

శివ:- సరె... రాముడూ! అనక శివపాదంగారువచ్చి ఆఖరి ప్రయత్నం చేస్తారు. కాదంటే సినిమాలో విలన్‌గా మారతాను. ఆటోమాటిక్‌గా నాలో ఆవేశం యెలాగూ పెరిగిపోతుంది. కత్తితీస్తాను. ముందు దాన్ని పొడుస్తాను. తర్వాత ఆ కత్తితోనే నన్ను పొడుచుకుంటాను. మావిషయంలో పోలీసువాళ్ళకి శ్రమలేకుండా స్వర్గంలోన్నా కల్సుకొని కులాసాగా కాలంగడుపుతాం.

రాము:- యీాడ నేదుగాని ఆడుంటుందా?

శివ:- వుంటుందో వుండదో నువ్వువచ్చాక విందువుగాని, కళ్ళతో చూద్దువుగాని—

రాము:- యీామాటలన్నీ అమ్మగారితో శెప్పమంటారా?

శివ:- (గుండెలుమీాద చెయి వేసుకొని) యింకానయం కొంప తీసి చెప్పావుకాదు. ముందు చెప్పటం తర్వాతచెయ్యటం అంతా నాకు నేనే చూసుకుంటాను. యీా సందర్భంలో నాకు ఆసిస్టెంట్లు అవసరంలేదు. నీకు నేనంటే పంచప్రాణాలూ కాబట్టి మనస్సులో వుంచుకోమని, మా ఘటాలు పోయాక మాగురించి భూలోకంలో ప్రచారంచేయమని కోరుతున్నాను.

రాము:- సరె. అత్తాగేలే ... (కుడివైపుకి నిష్క్రమిస్తాడు. శివపాదం సిగరెట్ ముట్టించి ఎడంవైపుకి నిష్క్రమిస్తాడు. అనంతరం తెర ప్రక్కకు తొలుగుతుంది రంగాలంకరణ మొదటిరంగం మాదిరే వుంటుంది. సావిత్రి సితారా వాయిస్తూ తనలోతాను కూర్చొని పాడుతూవుంటుంది)

ఆడుతా! హాయిగ పాడుతా
రాగములో అనురాగము కలిపి
ఆనందముగా పాడుతా! ఆడుతా! ॥ఆడు॥

నా సొగసై తీపిమిఠాయి కాదా
అదే ప్రేమ యీజగాన కాదా
అందచందముల రాజూ – రేరాజు
ఆరాజే నామోజులో మురియరాడా ॥ఆడు॥

శారద:– (నీరసించిన హృదయంతో, బక్కచిక్కిన శరీరంతో నెమ్మదిగా బయటనుంచి ప్రవేశిస్తుంది)

సావి:– (శారదనుచూసి అకస్మాత్తుగా పాటఆపి, సితారా అక్కడపెట్టేస్తూ) ఓ! (హేళనగా) శ్రీమతి శారదాదేవి గారా? పాపం మళ్ళీ యేదో పనిమీదేవచ్చినట్లున్నారు. దారితప్ప లేదుకద?

శార:– (విచారంతో) యేనాడైతే నాభర్తని నీవల్లోవేసుకున్నావో, ఆనాడే దగాపడి దారితప్పాను. భర్తనీడన నివసించవలసిన భార్యను, యేనాడైతే వేరుచేసి అగ్ని జ్వాలలు అలకరింపచేశావో ఆనాడే దారితప్పాను.

సావి:– ఈనాడు రావటానికి కారణం?

శార:– యెందుకొస్తాను? కట్టుకున్న భర్తకోసం – నీకాళ్ళు పట్టుకు బ్రతిమిలాడుకుందామని.

సావి:– నాకాళ్లుపట్టుకోటం దేనికి?

శార:- (విచారంగా) ఎందుకా? నాభర్త నీచేతిలో కీలుబొమ్మగావుండి, నువ్వాడించినట్లల్లా ఆడుతున్నారు. మా సంసారం చల్లగావుండటం నీకు యిష్టంలేక విషంకక్కుతున్నావు. నీకోసం సాటి ఆడదాని ఆనందానికీ నీ సుఖాన్ని అడ్డువేశావు. నన్ను అధోగతిపాలుచేశావు. నీమూలాన్ని మా కుటుంబం కూలిపోయింది. తిండికి, తండ్రికి మొహం వాచి మా జీవితపుష్పం ప్రతిఫలంగా రాలిపోయింది.

సావి:- అంటే...

శార:- ఉన్న వొక్కకొడుకునీ భూదేవికి అర్పితంచేశాను.

సావి:- (నవ్వి) అదా? మంచిపనిచేశావు. పీడవదిలిపోయింది.

శార:- ఆఁ! నాశాబు నీకళ్ళకి పీడగాకనిపించాడా? వాడు నీకేంద్రోహంచేశాడని అలా తూలనాడతావ్?

సావి:- కాకపోతే యెందుకు? నువ్వో పాపం యేడుస్తుంటే నీతోపాటుకలిసి యేడవడానికా?

శార:- తిండిలేకపోయినా యెవరిబిడ్డ వాళ్ళకి తీపే. పిల్లల్ని కన్నతల్లికైతే కడుపుతీపి తెలుస్తుంది. కనీసం మాతృహృదయం అంటే యేమిటో విన్నావుంటే యిలా మాట్లాడేదానివికావు. 'గొడ్రాలికేం తెలుసు బిడ్డతీపి' అన్నటు...

సావి:- (కోపంగా) ఏమిటే వాగుతున్నావు? నేను గొడ్రాలినా?

శార:- (విచారిస్తూ) కాకపోతే ఆమాటలు యెందుకొస్తాయ్? నేనీ ప్రపంచంలో యేకాకిని. నాకు దిక్కూ మొక్కూ

యెవ్వరూలేరు. వొక ఆడదాన్ని ఆడదే చులకనచేసి నడివీధిలో పడెయటం న్యాయంకాదు. నీలాంటిస్త్రీ సాటి అమాయకపుస్త్రీ భావాల్ని అర్థంచేసుకున్నప్పుడే మానవసమాజం బాగుపడుతుంది. ముందుకు వస్తుంది. అనాదినుంచీ వస్తున్న కుళ్లు కూలిపోతుంది అమ్మా! యిప్పటికైనా గుర్తించు. పంజరంలోచిలకలాగా నాభర్త నీ హృదయపంజరంలో బంధింపబడ్డారు. నీపాటకి వంత పాట పాడుతున్నారు. యిద్దరూకలసి నామీద కత్తికట్టి నన్ను యేడిపిస్తున్నారు నీకాళ్ళు పట్టుకుంటాను...

సావి:- అవన్నీ అనవసర అసందర్భపుమాటలు ... నీ భర్త నాయింట్లో లేదు.

శార:- అమ్మా! (కాళ్లుపట్టుకొని) యింకా వంచించాలని చూడకు. నన్ను కనికరించి నాకు పతిభిక్షపెట్టు. మాయ మాటల్తో మోసంచేయాలని ప్రయత్నించకు. అది నీలాంటిదానికి తగనిపని.

సావి:- (వెనక్కినడిచి) ఛీ ఛీ సిగ్గులేనిముండా! లేదనిచెప్తే మాటవినవేం ?

శార:- (నీరసంగా) యింకా యీస్థితిలో నన్ను కటాక్షించ టానికి నీకు ప్రాణంవప్పటల్లేదా! వొక్కసారిచూడు మీ ప్రాణాలకి వుసూరుమని నే నేవిధంగా రోదిస్తు న్నానో.

సావి:- (హేళనగా) ఏడుస్తే పైత్యపునీరు కారిపోతుంది. 'నుదుట వ్రాసినవ్రాత నూరేళ్ళు చింతించినా పోదు'

ఆయేడ్పే యేడుపు బయటకుపోయి యేదు ... నాయింట్లో యేడవకు. నీ శని నన్నూ చుట్టుకుంటుంది. నీభర్త నా యింట్లోనుంచి వెళ్ళిపోయాడు. ఆమాటే మళ్ళీ చెప్తున్నాను. (స్థాయి పెంచి) నీభర్త నాయింట్లోనుంచి వెళ్ళిపోయాడు.

శార:- (ఆదుర్దాగా) యెక్కడికి వెళ్లారు? (లేస్తుంది)

సావి:- అది నాకు తెలియదు. తెలిసికోవలసిన పనీలేదు. మతిచెడిపోయింది. నావాకిట్లోకి రావద్దని గట్టిగా చెప్పాను. వినలేదు. మెడమీద కర్రేసి గెంటించాను.

శార:- ఆఁ! నిజమేనా?

సావి:- నీలాంటి పరువుతక్కువ పాపిష్టురాలతో పరిహాసమా నాకు.

శార:- (ఈర్ష్యగా) ఛీ! నీ మొహంచూస్తేనే పాతకం చుట్టుకుంటుంది. భగవంతుడు నిన్నూ అందరిలాగే సృష్టించాడు. కాని హీనంగా జీవిస్తున్నావు. నీలో నీతి నశించింది. మానాభిమానాలు మంటకలుపుకున్నావు. ఆత్మ పరిశుద్ధంచేసుకోవాలనే ఆవేదన నీ హృదయంలో నలుసంతైనా లేదు. నీవు మనిషివని నేననను. నీతినియమాల్లేని రాక్షసివి.

సావి:- (కోపంగా) నోర్ముయ్!

శార:- అంతకంటే దుర్మార్గురాలివి. నీలాంటివాళ్లు నూటికి వకళ్ళున్నా ఆడజాతికంతకీ కళంకమే. నరరూపపిశాచీ.

సావి:- (పెద్దగా) ఆపు. (చెంపమీద కొడ్తుంది) కోరలు పిండినా కల్మషం చావలేదు. నీతో మాట్లాడవలసిన

పనిలేదు. నీసుఖాన్ని నువ్వే కాలతన్నుకున్నావు. నీగౌరవాన్ని నువ్వే గంగపాలుచేసుకున్నావు. అందుకు నేనేం చేయలేను. నాదగ్గర ప్రాధేయపడినందువల్ల ప్రయోజనంలేదు. 'నా వాకిట్లో పక్షిలాగాపడి గోలచేస్తే ఫలితం లేదు. నీభర్త యెక్కడున్నాడో వెతికి అతని కాళ్ళు పట్టుగు బ్రతిమిలాడుకో ఫో! ఫో!!

శార:- (ఆలోచించి) లేదు. నన్ను మోసంచేస్తున్నావు. నాభర్త నీయింటిలోనేవున్నారు. ఆయన నీఅడుగుజాడల్లో తిరుగుతున్నాడుకదాని యెక్కడోదాచావు మాటల్తో మోసంచేయాలని చూస్తున్నావు. యింతవరకూ అలాగే చేశావు. యికముందు చేయలేవు. నీఆటలు సాగనీయను. నన్ను అన్యాయంచేయాలని విషపుచూపులు చూస్తున్నావు. అల్లాచేయటం నీతరంకాదు...(రెండుభుజాలూ పట్టుకు వెర్రిగా) చెప్పు. నాభర్తని యెక్కడదాచావు? మాట్లాడవేం?

సావి:- (కోపంతో విదలించి తోస్తుంది శారద క్రింద పడుతుంది) ఆ దరిద్రుణ్ణి అనవలసినపనిలేదు ... నీ యేడుపే వాడికికొట్టింది...నీశనే వాడికి చుట్టుకుంది యెక్కడోపడి యేడుస్తూవుంటాడు...ఫో! నావాకిట్లోంచిఫో...

శార:- నాభర్త జాడ తెలియందే యెక్కడికిపోను?

సావి:- వెళ్లొకి... యెక్కడున్నాడో వెతికి వాణ్ణికూడా తీసుకుపో! మీాపీడా, మాపీడా, యీావూరుపీడా వక్కసారిగా వదిలిపోతుంది.

శార:- పీడ — వున్న ఆస్తిని నీపొట్టన పెట్టుకునేటప్పుడు పీడఅని పించలేదా ? అప్పుడులేని పీడ యిప్పుడే అనిపిస్తోందా ? ఆయనకాదు పీడ నువ్వు. మా కుటుంబానికి శనిదేవతగా మమ్మల్ని ఆవరించావు.

సావి:- (కోపం యెక్కువై) బైటికిపొమ్మంటుంటే యేమిటే వాగుతావు (జుట్టుపట్టుగు బయటకు బలవంతంగా తీసుకు పోయి తిరిగి ప్రవేశించి) శని విరగడయిపోయింది. (హేళ నచేస్తూ) ప్రపంచంలో యీావిడ వక్కతే పతివ్రతట యిలాంటి మహాపతివ్రతలంతా వుండబట్టే కాలం యిలా గడ్డలయింది (ప్రక్కకుతిరిగి) రాముడూ ! రాముడూ ! ఈ వెధవెక్కడికిపోయాడో క్లబ్బుకిపోవాలి నాలుగ్గంటల కల్లారమ్మంటే అయిదయినా అంతులేదు నాకోసం భద్ర య్యగారు యెదురుచూస్తూవుంటారుకూడా ... (అటూ ఇటూచూసి టేబులుమీాద కాగితాలు సర్దుతూవుం టుంది మోహనుడు బయటనుంచి ప్రవేశిస్తాడు...సావిత్రి అగస్మాత్తుగా మోహనుణ్ణిచూసి రెప్పవాల్చకుండా శిలా విగ్రహంలాగా రెండునిముషాలు నిలబడిచూస్తుంది)

మోహ:- (సావిత్రిని యీర్ష్యగాచూస్తూ) ఏమిటలాచూస్తు న్నావు ? నేనెవరో గుర్తుపట్టలేదా ? సూరయ్య బావ మర్ది మోహనరావుని—

సావి:- (భయపడుతూ తనలో) అడే వీణ్ణి నామీాదికి పంప లేదుకదా...(లేనిధైర్యం తెచ్చుకొని) నిలబడేవున్నారు కూర్చోండి.

మోహా:- కూర్చోటానికి అవకాశంలేదు.

సావి:- యేదో పనిమీదే వచ్చారనుకుంటాను.

మోహా:- అవును నీతోనే.

సావి:- (ఆశ్చర్యంగా) నాతోనా ? ఎందుకు ?

మోహా:- (బరువుగా) కోరలుపిండి విషాన్ని కక్కిస్తానికి.

సావి:- (భయంగా) ఏవరిచేత ?

మోహా:- నీచేత. (ముందుకునడుస్తూ) యేమంటావ్ ?

సావి:- కారణమేమిటో తెలియచేయండి.

మోహా:- (జేబూలోనుంచి కాగితంతీసి చూపిస్తూ) యీకాగితాలేమిటో తెలుసా ?

సావి:- తెలియదండి. యేమిటి ?

మోహా:- (సమీపించి) వీటిమీద నువ్వు సంతకంచేయాలి.

సావి:- ఎందుకు ?

మోహా:- చేసినపాపం అనుభవించటానికి—మాయమాటల్తో మోసంచేసినందుకు.

సావి:- నేనెవర్నీ మోసంచేయలేదే !

మోహా:- (వికృతంగాచూస్తూ) లేదూ ? సరిగా ఆలోచించు.

సావి:- (ఆలోచించి) లేదండి.

మోహా:- మాబావ సూరయ్యని మోసంచేసి ఆస్తి వ్రాయించుకోలా ? నిజంచెప్పు.

సావి:- రామరామ... నేనెందుకుచేస్తాను ?

మోహ:- ఎందుకుచేస్తావా ? నీ కాళ్ళదగ్గర కుక్కలాగాపడు న్నందుకు—పూటకిగతిలేక ఆకలితో అల్లల్లాడే ఆరోజుల్లో మీ దంపతులని కనికరించి కాపాడిన సూరయ్యని అమాయకుణ్ణిచేసి, వంచించి మోసంచేసి ఆయన ఆస్తిని హ్రాయించుకున్నావు. ఆయనకళ్లకి నీ అందాన్ని అడ్డంపెట్టి పిత్రార్జితం, కష్టార్జితం మొత్తం స్వాధీనపర్చుకున్నావు. ధనికురాలివయ్యాక కళ్లు నెత్తిమీదకొచ్చి, లక్షాధికార్ని భిక్షాధికారిచేసి, భార్యాబిడ్డలతోసహా భ్రష్టుల్ని చేశావు. కుక్కనుకొట్టినట్లు కొట్టించి యింట్లోనుంచి యీడ్పించావు ... అంతమాత్రంతో సరిపోతుందనుకున్నావ్ ? అవునా ? మాట్లాడవేం ?

సావి:- (ధైర్యం తెచ్చుకొని) మీరు పెద్దమనుష్యులని యెంచి మీకింతవరకు గౌరవంయిచ్చాను. 'త్రాగలేనిపిల్లి బోర్లతోసుకున్నట్లు' యిచ్చిన గౌరవాన్ని నిలుపుకోలేకపోతున్నారు. జరిగిన విషయాల్నిగురించి యిక్కడ చర్చించటానికి మీకు హక్కులేదు.

మోహ:- లేదూ ? సూరయ్యఅంటే యెవరోఅని అపోహపడకు. నాచెల్లెలుభర్తని మళ్ళీ గుర్తుచేస్తున్నాను.

సావి:- అయితే ?

మోహ:- దారితప్పిన మా బావని దార్లోపెట్టటం నావిధి... అసందర్భపుమాటలతో కాలయాపనచేయటం నేనుఅంగీకరించను ... మర్యాదగా దీనిమీద సంతకంచేస్తావాలేదా ? (ముందుకునడుస్తూ) చెప్పు.

సావి:- (వెనక్కి నడుస్తూ) దౌర్జన్యంతో లొంగదీయిస్తారా?

మోహ:- (కోపంగా) లేకపోతే ప్రతిమాలాడమంటావా?

సావి:- సూరయ్య ఆస్తి నాకేంయివ్వలేదు.

మోహ:- ఇచ్చాడోలేదో తర్వాతసంగతి. ముందీకాగితం మీద సంతకంచెయ్. ఆలశ్యంచేస్తే ఆధారంగా నీప్రాణం తీస్తాను.

సావి:- (ఈర్ష్యగా) యెంతసాహసించిమాట్లాడుతున్నారు? ఆడదానిమీద చెయిచేసుకుంటే ఆరునెల్లు కఠినశిక్ష అనుభవించాల్సివస్తుందని తెలుసుకుమాట్లాడండి.

మోహ:- ఆరునెల్లుకాదు ఆరుసంవత్సరాలైనా ఆనందంగా అనుభవిస్తాను. యేమంటావ్? (జుట్టుపట్టుకు గుంజుతూ స్వరంపెంచి) సంతకంచేస్తావాలేదా?

సావి:- (విదిలించుకొని) యేమిటీదౌర్జన్యం? నలుగుర్నీపిల్చి నిన్ను పోలీసులకప్పగిస్తాను.

మోహ:- పోలీసులు...హహహహహ ... యేంచేస్తారు పోలీసులు? యెవర్నిపట్టుకుంటారు పోలీసులు? ప్రభుత్వం కళ్లుమూసి వ్యభిచారిణిగాజీవిస్తూ, ప్రజల్ని మోసంచేసి యెన్నోకుటుంబాలు కూలుస్తున్నావుకాబట్టి, పోలీసువాళ్ళంటే నీకు బెదురుంటుంది. న్యాయంకోసం పోరాడే నాలాంటి నిష్కల్మషజీవికి పోలీసులంటే భయంవుండదు. (కాగితాలు చూపిస్తూ) ముందు చేస్తావాలేదా?

సావి:- కారుకూతలతో కంగారుచేసి కార్యం సాధించాలని చూస్తున్నావుకాని అది నీ చేతకానిపని. (పెద్దగా) నా బొందిలో వూపిరుండగా నే నా కౌగిలాలమీద సంతకం చేయను.

మోహ:- మోసక త్తె యింకా యెన్ని కుటుంబాలు కూల్చాలని ఆశవుంది? యీ రోజుతో నీ ఆశను అతఃపతనంచేసుకో. (బొడ్లోనుంచి క త్తితీసి) చేసిన పాపానికి అనుభవించి సంత కంచెయ్. (క త్తిచూపిస్తూ) కాకపోతే నీప్రాణాల్ని మూట కట్టుకో.

సావి:- (క త్తి చూస్తుంది వళ్ళంతా చెమటలుపోస్తాయి. భయం యెక్కువవుతుంది) ఆఁ! చంపుతావా?

మోహ:- వచ్చినపనికాకపోతే అంతపనీచేస్తాను.

సావి:- (తెల్లబోయి భయంగాచూస్తూ) అంత అపకారమా?

మోహ:- కాదు. యెంతోవుపకారం. ప్రపంచానికి యెంతో మేలుచేసినవాణ్ణవుతాను...నీలాంటి చీడపురుగుల్ని చిత్ర వధచేస్తేనేగాని సంసారస్త్రీలు నిర్భయంగా నిద్రపోరు. అప్పుడుకాని సంఘం బాగుపడదు. అప్పుడే కుటుంబాల్లో కల్లోలాల్లేకుండా కాలం గడుపుతారు...ముందు నీప్రాణా లుతీస్తే నిన్ను ఆదర్శంగాపెట్టుకొని, నీలాగా చెలరేగి పాడయ్యే స్త్రీలు దుష్ప్రవ ర్తననుండి విముక్తులై సత్ప్ర వ ర్తనలోకి వస్తారు. (నవ్వి) అందుకు నాప్రాణాల్ని లెక్క చేయను. ముందు నీప్రాణాలుతీస్తాను. (ముందుకునడుస్తాడు)

సావి:- ఆఁ! (భయంగా మోహనరావునిచూస్తుంది)

మోహ:- నీలాంటిపురుగులు చస్తేనేకాని శాంతిలేదు.

సావి:- (ధైర్యం తెచ్చుకొని) నువు మనిషివా పిశాచానివా?

మోహ:- ఆ పిశాచానివి నువ్వే. పిశాచాల్ని నామరూపాల్లేకుండా సలపాలని కంకణం కట్టుకున్న సామాన్య మానవుణ్ణి నేను. (వొకచేత్తో సావిత్రి జుట్టుపట్టుకొని రెండవ చేత్తో కత్తిమెత్తి) సంతకంచేస్తావా వొక్కపోటుతో నీ ప్రాణంతీయనా?

సావి:- (అటూయిటూచూసి భయంతో గత్యంతరంలేక) నన్ను చంపకు ... చేస్తాను ... ఆ కాగితంమీద సంతకం చేస్తాను.

మోహ:- (జుట్టు వదిలి కాగితం అందిస్తాడు) చెయ్.

సావి:- (వణికిపోతూ సంతకంచేసి యిస్తుంది)

మోహ:- ఆ స్త్రితాలూకు దస్తావేజులెక్కడ?

సావి:- అవికూడా యెందుకు? (జాలిగాఅంటుంది)

మోహ:- ముందివ్వు. (కళ్లెర్రచేస్తాడు)

సావి:- యిస్తాను. (బీరువాదగ్గరకు పోతుంది. మోహన్ ఆమెను అనుసరిస్తాడు. బీరువాలోనుంచి దస్తావేజులిస్తుంది)

మోహ:- (కాగితాలు జేబులోపెట్టుకొని) దురాశ యిలాగే నిరాశవుతుందని గ్రహించు. యికముందన్నా కళ్లుతెరచి సంచరించు. (కత్తిఅక్కడ పారేశి ఆదుర్దాతో బయటకు వెళ్తాడు)

సావి:- (మతి చెడిపోయింది. పిచ్చిచూపులుచూస్తూ) నాబ్రతుకునీళ్లపాలయింది. యెంతఆస్తి. యెంతఆస్తి. అంతా అయిదు నిమషాల్లో మాయమయింది (ప్రక్కకుతిరిగి) మోహన్ రావుగారూ! నన్ను చంపకండి. నన్ను చంపకండి (చేతుల్లో కళ్లుమూసుకొని) చేసినది తప్పని వప్పుకుంటున్నాను. సహించరాని అన్యాయమే! స... హిం... చ... రాని అన్యాయమే... యెంతో శ్రమపడి సంపాదించాను. యింక నేనేంచేయను? ముందు నాగతేమిటి?

(తెరలో నాల్గువైపులనుంచి విషపునవ్వులు వినిపిస్తాయి)

ఆత్మ:- (స్త్రీ కంఠంతో) దౌర్భాగ్యురాలా! కట్టుకున్న భర్తనికాదని, ఆశకొద్దీ పరాయిపురుషులకి నీ సీలాన్ని విక్రయించావ్. కోటీశ్వరాలువవుదామని కులికావ్. పతివ్రతల సుఖాన్ని విరిచి ప్రపంచాన్నే పరిపాలిద్దామనుకున్నావ్. అన్నిటికీచెడ్డావ్. యింక నువ్వు బ్రతికి యెవ్వర్ని వుద్ధరిస్తావ్? బ్రతికివున్నా చచ్చినవాళ్లతోజతే. ప్రపంచంలో యేది ద్రోహంగా పరిగణింపబడుతుందో అదే నువ్వాచరించావు. దానికేనువ్వు తలవంచావ్. ఆడదానికి 'సీలవతి' అనిపించుకోటంకంటే భూషణం మరొకటిలేదు. ఆ మాటే అనిపించుకోలేకపోయావ్. యిప్పుడన్నా నిజం తెల్సుకొని, స్త్రీలలో జరుగుతున్న అత్యాచారాలకి నీ ప్రాణాల్ని బలివ్వు. వెళ్లు! వెళ్లు!! ప్రాణాల్నిబలివ్వు! (నాల్గువైపులనుంచి 'వెళ్ళు ప్రాణాల్నిబలివ్వు' అని ప్రతిధ్వనిస్తుంది)

సావి:- (మతిచెడిపోయి అటూయిటూ తిరుగుతూ ఆలోచిస్తుంది. క్రిందకత్తి నిచూస్తుంది పిచ్చిచూపులుచూచి ఉత్తరం వ్రాసి డ్రాయరుసొరుగులో పెడ్తుంది అనంతరం విచారంలో) నేనుచేసింది నేరం. ఎప్పటికీంటాను సహించరాని నేరం. నామూలాన్న స్త్రీజాతికంతకీ కళంకంవస్తుంది. యింక నేను బ్రతకటంకంటే చస్తేమంచిది. నేను చేసినపాపాలకి అనుభవించితీరాల్సిందే. (కత్తిసితీసుకొని రెప్పవాల్చకుండాచూస్తూ అనుభవించితీరాల్సిందే(అనిపొడుచుకుంటుంది. రెండు నిముషాలు బాధపడి ప్రాణంవిడిస్తుంది- శివపాదండక్షులు చూస్తూ ప్రవేసిస్తాడు. ఆక్రిందపడివున్న సావిత్రి కాళ్లకు తగుల్తుంది. కంగారుగా సావిత్రినిచూసి పెద్దగా 'సావిత్రీ!' అని కేకపెట్టి మీదపడి యేడుస్తూ వుంటాడు)

రాము:- బయటనుంచి ప్రవేసించి ఆదృశ్యాన్నిచూచి గాబరాపడి చప్పిడికాకుండా వెనక్కి నడిచి తలుపులు వేసి వెళ్తాడు)

శివ:- (విచారంగా) మనలోమనమాట అప్పుడే చచ్చిపోయావా సావిత్రీ! యీవిధంగా చస్తావని నే నెప్పుడూ అనుకోలేదుకద. మనలోమనమాట సావిత్రీ! నీకు నువ్వే చచ్చావా యెవరన్నా చంపారా? యెంత శేపయింది యీ పనిజరిగి? మొహం యింకా వాడిపోలేదు. యెప్పుడు చూచినా కళకళ్లాడుతూ వికాసంగావుండే నీ మొహం వొక్కసారిగా ముడుచుకుపోయింది. నీ మీద యెన్నో ఆశలు పెట్టుకున్నాను. అవన్నీ యేంచెయ్యను? నువ్వు

సా లేకపోతే నేను బ్రతికిమాత్రం ఎవర్ని వుద్ధరిస్తాను- అవన్నీ అట్లావుంచుమనలోమనమాట నిన్ను గురించి నేనెంత సేపని యేడవను? నాకడుపు కళ్లేపల్లి చెరువయేదాకా యేడవాల్సిందేనా? మనలోమనమాట మాటవరసకన్నా యెవరితో చెప్పకుండా తొందరపడి యెందుకుచచ్చావు సావిత్రీ. కనీసం కాకిచేతకబురుచేసినా వచ్చిపడేవాణ్ణిగా. బ్రతికుండగా నామీద అసహ్యం, కోపంవుంటే చచ్చేటప్పుడుకూడా వుండాలా ? కట్టుకున్న ముండాకొడుకుమీద ఆపాటికనికరం చూపలేకపోయావా సావిత్రీ. నువ్వులేనిబ్రతుకు నే నెందుకు బ్రతకాలి ? (కత్తితీసి) యీ కత్తితో నే నేనూ పొడుచుకుంటాను. యింక నేను చచ్చినాబ్రతకను. వద్దని బ్రతిమిలాడనా బ్రతకను. నాది ఒక్కటే దీక్ష. మనలో మనమాట యిక్కడో అక్కడో మనమిద్దరం యేకంగా వుండాల్సిందే సావిత్రీ! వస్తున్నాను. యిప్పుడేవస్తున్నాను. (కత్తినిచూచి పెద్దగా యేడ్చి అనంతరం పొడుచుకోబోతాడు. వెనకనుంచి పోలీసు తొందరగావచ్చి చెయిపట్టుకుంటాడు) ఆఁ! యెవరు ప్రాణబిక్షపెట్టిన పున్యాత్ములు (నెమ్మదిగా తెల్లబోయిచూస్తూ) పోలీస్ ! ... (వణికిపోతాడు)

రాము:- (మరోపోలీసుని వెంటపెట్టుకు ప్రవేశిస్తాడు) ఆయనే నండిసంపింది.

శివ:- (విచారంగా) అదేమిట్రా రాముడూ ! నేనుకాదురా నీయిల్లు బంగారంకానూ.

రాము:- కాదంటే పోతుందంటండి! పొడవగానే నువు పారి పోయినట్టయితే, యిదంతా యదవని నామీద యిర్సుగు పడేసి కంద. (పోలీసు కత్తిహాండోవర్ చేసుకుంటాడు)

పోలీ:- (గొలుసుతీసి) చేతులుదగ్గరకుపెట్టు.

శివ:- మనలోమనమాట నావేనా! (ఏడుస్తాడు)

రాము:- మీాయికాపోతే నాయా?

పోలీ:- అనవసరంగా గోలచేయక పట్టు.

శివ:- (చేతులు దగ్గరకుపెట్టి రాముణ్ణిచూసి యేడుస్తూ) యేంరా రాముడూ మనలోమనమాట యేం న్యాయంరా యిదినీకు.

రాము:- పొద్దున నాతో శెప్పారుగామీరు. సాయంత్రంమాట యినకపోతే సంపుతానని, సస్తానని- అట్టాగే అయమ్మని సంపారు.

పోలీ:- మీరు చావబోతున్నారు.

శివ:- మనలోమనమాట నాకు అంతధైర్యం ఎక్కణ్ణుంచివస్తుం దనినమ్మావురా?
(సావిత్రిశవాన్ని యేడుస్తూచూసి) సావిత్రీ! ఆకరికి నాపని యింతేనా? మనంమనం యిప్పట్లో కలుసుకునేయోగ్యత లేదా?

పోలీ:- చస్తే యింక కల్సుకోవటమేమిటయ్యా!

శివ:- అక్కడేనయ్యా! (యేడుస్తూ)

పోలీ:- విచారణఅవనీయ్. గొర్నమెంటేకలుపుతుంది. గోల చెయ్యకపద.

శివ:- (ఏడుస్తూ) సావిత్రిని నేను చంపానని రాముడు చెప్పినంతమాత్రాన మీరు నమ్మేతారా పోలీసువారూ?

పోలీ:- నమ్మటంనమ్మకపోవటం అలావుంచండి. కళ్లకి ప్రత్యక్షంగా శవంక్రింద, కత్తినీచేతులోను కనిపిస్తుంటేను. అదేసాక్షం.

శివ:- అంతేనా!

పోలీ:- మరెంత? పద. (నెట్టుకుపోతూ) అప్పలనరసయ్యా! శవందగ్గరుండు నేనువెళ్లి వాన్ పంపిస్తాను.

రాము:- యెందుకుగాబూ!

పోలీ:- శవాన్ని హాస్పటల్లోచేర్చి కోయిస్తారు.

శివ:- కోయించడమే (పెద్దగా యేడుస్తూ)

పోలీ:- పదవయ్యా! (నెట్టుకుంటూ పోతాడు)

రాము:- (శవానికి గుడ్డకప్పుతూవుంటాడు)
(అక్కడున్న పోలీసు బీడీముటించి అక్కడున్న కుర్చీలో కూర్చుంటాడు)



— తెర —

# పెళ్ళయ్యాక చూడు

## 6 వ రంగము

[విజయవాడలో వీధిలో శారద పాలతట్ట నెత్తిమీద పెట్టుకు ప్రవేశిస్తుంది జనం అటూయిటూ తిరుగుతూవుంటారు]

శార:- బలేపాలు మామంచిపాలు, మరి
మించిపోయినా దొరకనివండి ॥బలే॥

ఆవుపాలు మరి వంటికిమంచివి
అందచందములు యిచ్చేవండి
బాగాబలిసిన బఱ్ఱెలపాలు
వెన్నమీగడలు యిచ్చేవండి
నీళ్లుకలపని చిక్కనిపాలు
నమ్మకముంచుకు కొనరండి ॥బలే॥

పాయసమునకు పనికొచ్చేవి
పసందైన మా చిక్కనిపాలు
కాఫీలోకీ కమ్మగవుండును
తోడుపెట్టుటకు తీరుగవుండు
నిఖాసయినవని నమ్మండీ, ఆ
నమ్మకతోనే కొనండిపాలు ॥బలే॥

పాలండీ! పాలు! (అదేపాటతో మరోబజారుకి వెళ్తుంది)

అనంతరం వొకవైపునుంచి రాముడు, మరో వైపునుంచి మోహనరావు ప్రవేసిస్తారు)

మోహ:- (ఆగి) ఎవర్రాఅది (తిరిగి రామున్ని చూస్తాడు)

రాము:- నానుదొరా! రామున్ని.

మోహ:- యేంరా రాముడూ! యిక్కడకొచ్చావేం? మీ అమ్మగారు యెవర్నన్నా తీసుకురమ్మన్నారా?

రాము:- (ఏడుపు మొహంతో) అదేంటండీ! యెప్పుడూ వొకటేమాటలా?

మోహ:- మరెందుకొచ్చావో చెప్పు?

రాము:- అది సెప్తానుగాని దొరా! తమరిప్పుళ్లోవుండ్డారేం?

మోహ:- ఈ వూరు టాన్సఫర్ చేశారు.

రాము:- (తెల్లబోయి) టానసుఫేరా? అంటే!

మోహ:- బదిలీ చేశార్రా!

రాము:- అదాదొరా! అట్టానిముందే శెప్పరాదూ? బాసలో సెప్తే నాబొంద నాకేటి తెలుత్తాది?... సరేగాని దొరా! మీ ఆడంగులూ మీరూ కల్సిపోయారంటగా?

మోహ:- (నవ్వి) ఎవరుచెప్పారు?

రాము:- మనూళ్లో కుటుంబయ్యగోరు శెలపతయ్యగోరితో శెప్తుంటే యిని సంతోసించాను. నిజమేనాదొరా?

మోహ:- నిజమే అంత కలసేవుంటున్నాము.

రాము:- పెల్లయ్యాకసూడు. ఆ దేముడు తగాయిదాలు తెంపి యెంతకాలానికి యేకంసేసినోడో. అయితేదొరా!

ఆళ్ల దీయిాపూ రేగాంసు మిామామగోరు. పెళ్లంగోరు మాటపకారం ఆల్లింటికాడ మిారుంటుండారా? మిామాట పకారం మిా యింటికాడ ఆల్లుంటుండారా? వోరిమాట నెగ్గింది?

మోహ:- నామాటే నెగ్గింది. అంతాకలిసి మాయింటిదగ్గరే వుంటున్నాం.

రాము:- అదేగాన్యాయం. ఆడది మొగాడింటికొచ్చి కాపరం శేయాలి. అదిమనదర్మం. మిామామగారేటో మిమ్మల్నె ఆల్లింటికొచ్చి వుండమంటారు అదేటన్నాన్యాయమా? శెడగా శెడగాగాని కాపరాలు కావని ఆ దర్మాన్ని యిప్పుడు తెలుసుకుండారు.

మోహ:- యెవ్వారికైనాఅంతేగా. అనుభవం మిాదగాని న్యాయం, ధర్మం తెలియదు.

రాము:- అందేగామరి మిాఆడంగులు చ్చేమంగావుండారా బాబు!

మోహ:- ('ఉన్నాం' అన్నట్లు తలూపుతాడు)

రాము:- (నవ్వి) సంతోసం, శానాసంతోసం ... అయితే దొరా! సూరయ్యగోరు శారదమ్మగోరు యేడన్నా దొరికారా?

మోహ:- లేదురా—శారదకనిపించలేదు. మాబావసూరయ్యా కారుక్రిందపడి కాలువిరగకొట్టుకున్నాడు.

రాము:- పాపం, రామరామ, యెంతమాటిన్నాను. పానం సిటుక్కుమంది. మరి ఆ కాలు నేటి శేశారుగాబూ!

మోహ:- విరిగినంతవరకు తీశేశారు. కులాసాగా నేవున్నాడు.

రాము:- పోనీలేదొరా. మరి అమ్మగోరిసంగతి...

మోహ:- పత్రికల్లో ప్రకటించామ్!

రాము:- ఆ మాటయినేగా అడుగుతుండాను. ఆటివల్ల నాబం నేకపోయిందా?

మోహ:- యింతవరకులేదు. ప్రతి పోలీస్టేషన్ కి ఫోటోలు పంపాను. వూరువూరు మనిష్యుల్ని పంపి వెతికిస్తున్నాను.

రాము:- యిన్ని సేసినా యింతవరకు నాబంకనిపించలేదన్న మాటేగా?

మోహ:- లేదు.

రాము:- (తనలో) యెక్కడుండారో! యేటి శేత్తుండారో!

మోహ:- రాముడూ! మర్చిపోయాను. యింతకీ యీవూ రెందుకొచ్చినట్లు?

రాము:- (మెడమీదకొట్టుకొని) యదవని అసలుయిసయమే మర్చిపోయాను. సావిత్తరమ్మ సచ్చిపోనాది. శివపాదం గోర్ని పోలీసోళ్లట్టికెల్లినారు.

మోహ:- శివపాదం చంపాడా?

రాము:- శెప్పేదియునండి. నానింటోలేను. యింటికొచ్చే సరికి అయ్యగోరు అమ్మగోరి శవంకాడకూకుని యేడు

త్తుండారు. ఆపాట్ని నాకు కాల్లు శేతులూ వనికిపోయి, ముందు నన్నెట్టుగెల్తానోనని బయపబడ్డాను— యింటో ఆసమయాన ఆయనొక్కరే వుండారుగాదూ? ఆయనే సంపారని అనుకుండా, యెదవమొహాన్ని యెంటనేయెల్లి పోలీసోల్లకి శెప్పేసినా. ఆల్లు నాయెంటేవచ్చారు — మేమంతాకల్సి వచ్చేప్పటికి అయ్యగోరు పోడుచుకో పోతుండారు. పోలీసోల్లు ఆయన్ని పట్టికెల్లారు. తరువాత యీ వుత్తరం దొరికింది దొరా (అంటూ తలపాగనుంచి వుత్తరంతీసి మోహన్ కి అందిస్తాడు)

మోహ:- (మోహనరావు అది లోలోన చదువుకుంటాడు)

రాము:- ఆకాయితంగోడా యదవని నాకేదొరికింది. నానేటి శేసినానూ, అదేటో సిత్తుకాయితం అనుకొని అవతల యిసిరాను— అక్కడే మీలాటి చదువుండామూ రాజుండి, ఆకాయితంసూసి అందులోయిసయమంతా శెప్పేసినోడు. ఆకాయితంతీసుకొని యదవని నేరుగా పోలీట్టేషనికియెల్లి యిశారించాను. యినంమాత్రగోరు అయ్యగోర్ని రాజమంద్రం తీసికెల్లారని శెప్పారు. యదవని టిక్కెట్టుకికూడా నాదగ్గర డబ్బుల్లేవు ... పానాలకంటె యిది యెక్కువేటని, సేసిన పాపం శెప్తే పోతుందంటారు యేటవుతేఆదిఅవుద్ద నేరుగా బండెక్కాను.

మోహ:- అభివందనాలు.

పెద్దలమాటలు త్రోసిపుచ్చలేక, లోకంకోసం, సంఘం కోసం, పెళ్లాడి, పరువుప్రతిష్టల్ని మర్చిపోయి భర్తనిఅమా

యత్నించేసి, ఆతనికండ్లకు గంతలుకట్టి, అతనిజీవితాన్ని అంధకారంచేసి, పరపురుషుని సుఖంకోసం ప్రాకులాడాను ఫలితంగా నన్నునమ్మి నాకోసం, కట్టుకున్న భార్యని, కన్న కొడుకుని మర్చిపోయి. నేనేసర్వస్వమని నమ్మించి, నామూలాన వాళ్లని అనరాని బాధలుపెట్టించి, డబ్బుకి ఆస్తికి ఆసించి, ఆధారంగా మొఖాసాదార్ సూరయ్యగార్కి ముట్టచెంబిచ్చాను ... కూడబెట్టినఆస్తి కూలిపోయింది. నా భర్త వెర్రివాడులాగా వీధులవెంట తిరుగుతున్నాడు. నేను ఆచరించిన అసభ్యపుపనులు, నడచిన దుర్నడత నాహృదయంలోగునపాలై గుచ్చుకుంటున్నాయి. వ్యభిచారిణిగా జీవించేవాళ్ల జీవితాలు యెప్పుడో వొకప్పుడు యిలాజరగవలసిందే! ఆఖరికి యిలామారిపోవలసిందేనని, యీరోజుననమ్ముతూ బ్రతుకుమీదవిరక్తి కలిగి ఆత్మహత్య చేసుకుంటున్నాను. యీ వృత్తరాన్ని ఆధారంగాతీసుకొని నేనుసంపాదించినదంతా సూరయ్యగార్కి . చెందేలాగునచేసి, ఆదర్శంగా ప్రపంచంలో వ్యభిచారిణులకు నా కథను గుణపాఠంగా బోధిస్తారని ఆసిస్తున్నాను. మానవసమాజంనన్ను క్షమిస్తుందోలేదో!

శెలవు.

విజయవాడ
ది 15-6-52

వ్యభిచారిణి.
సావిత్రి

సావిత్రి తగినప్రతిఫలం అనుభవించితీరింది. శివపాదం చాలాఅనగాయకుడు యీ వృత్తాంతం మనకు చాలా వుప యోగకరమైంది గా పోదాం యీపూటే శివపాదాన్ని విడిపించే ప్రయత్నాలలో దిగుదాం.

రాము:- చిత్రం

(యిద్దరూ నిష్క్రమిస్తారు.

[ శారద పాటపాటపాడుతూ ప్రవేశిస్తుంది. పోలీసు అటుపోతూ పోతూ ఆగి తనజేబులోనుంచి ఫొటోతీసి వొకసారి శారదనిచూసి, తర్వాత ఫోటోనుచూస్తాడు "ఔనావాదా" అన్నసందేహంతో ఆలోచిస్తూవుంటాడు శారద మరోరోడ్డుకు పోతుంది "ఏయ్ పాలమనిషి" అంటూ ఆమెను అనుసరిస్తాడు పోలీసు. అనంతరం మధ్యతెర ప్రక్కకు తొలగుతుంది. స్థలం : మోహనరావు నివసిస్తున్న భవనంలోని వొకవైపుభాగం. మదత మంచం దానిమీదదిండు వొకప్రక్కగావుంటాయి మరొకప్రక్క వొక రెండు టేబులు. దానిచుట్టూ కొన్నికుర్చీలూ వుంటాయి. ప్రక్కగా టెలిఫోన్ వుంటుంది టేబుల్ మీద కొన్ని పుస్తకాలు. పత్రిక. పూలకూజా వుంటాయి సూరయ్య బాగామాసినగెడ్డంతో చంకలక్రింద కర్రల్ని ఆధారంగావుంచుకొని నిలబడి పిచ్చిగాచూస్తూ ఆలోచిస్తూవుంటాడు ]

సూర:- (పిచ్చిగానవ్వి ప్రపంచమంతా తలక్రిందయింది ... సంసారి సానిగామారింది ... సానులు సంసారులుగా మారారు... పెళ్లయ్యాకచూడు...కక్షులతో కాపరాలు కూలిపోతున్నాయ్ ... కోడల్ని అత్త — కోరంటికం పెడ్తుంది. కొడుకు అప్రయోజకుడై చూస్తూవున్నాడు.

మానవుల బుర్రల్లో మెదడు చెదలుతిని పోయిందంటాను. కాదంటే నాకు కష్టంకలుగుతుంది.] (నవ్వి ప్రక్కకుతిరిగి) ఆఁ! అడిగో నా బాబు ... అడిగో నా బాబు ... ఆఁ! వస్తావా? వద్దు...వద్దు...మళ్లీ రాకు... యిది మాయా ప్రపంచం...సత్ పురుషులు యిక్కడవుండటానికి స్థానం లేదు... నీ పట్ల నీ తండ్రిఅన్యాయంచేశాడు... అల్లారు ముద్దుగా పెంచుకోవలసిన నిన్ను అధోగతిపాలుచేశాడు. నీ ప్రాణాల్ని నా దురలవాట్లకి బలితీసుకున్నాను. మళ్లీ రాకు. వస్తేయిక్కడ నానాఅగచాట్లూపడాలి. యింకా కష్టాల్ని అనుభవించాలి. (రెండునిముషాలు తెల్లబోయి చూచి) మరణించాడు నా చిట్టిబాబు. (విచారంగా) అవసానదశలో దగ్గరవుండటానికి దశలేకపోయింది. కనీసం కంటితో చూట్టానికైనా నోచుకోని నిర్భాగ్యుణ్ణయినాను. నేనుపాపిని. నాలో వ్యక్తిత్వం హతమయింది. నేనూ మానవుణ్ణే! మానవులమధ్యనే జీవిస్తున్నా! వాళ్లతో తిరుగుతున్నా! కాని అందరిలాగావుండక నా మానవత్వాన్ని మంటకలుపుకున్నా— వెనకముందుకు ఆలోచించకుండా ప్రవర్తించాను. అనుభవిస్తున్నాను. నేనేకాకుండా నా వంశం కూకటివ్రేళ్లతో కూలిపోవాలనేవుద్దేశ్యంతో ఆరంభలాడి సావిత్రే మాయోపాయంతో నా బాబుని చంపించివుంటుంది. అదేనా శారదనిఆవూళ్లోనుంచి తరిముంటుంది. యిదేనిజం ప్రపంచానికంతా తెలియజేసేనిజం యిదే. ముమ్మాటికీ యిదేనిజం. అందుకే ప్రతీకారంగా భగవంతుడు సావిత్రిప్రాణాలుతీసి పరాభవించాడు. ఆ పని

మానవసమాజం చేయలేకపోయింది. ఎందుకనో తెలుసా? ఆడదాన్నిచూస్తే బయపడుతుంది. అదికాదు. ఆడదాని ప్రవర్తనచూచి భయపడతారు. యింకా శారద చాలా వోసికపట్టింది. చివరికి పతివ్రతలు జీవిస్తానికి అస్కారం లేదనుకుంది. వాళ్లు బ్రతికటానికి తావులేదనుకుంది. గుప్‌ చిప్‌గా వెళ్లి ప్రాణాలువిడిచి కొడుకుదగ్గిరికిపోయి కలాసాగా వుండి వుంటుంది. (పిచ్చిగా నవ్వుతూవుంటాడు. బయట నుంచి మోహన్‌రావుఅట్టపెట్టెతో ప్రవేసిస్తారు. సూరయ్య మోహనరావునిచూసి కొంచెం భయంగా వెనక్కువెళ్లి మంచంమీాద కూర్చుంటాడు)

మోహ:- (అట్టపెట్టెతీస్తూ) నామాటవినవ్‌ ! ఆ గుడ్డలుమాసి పోయాయ్‌. యీగుడ్డలు వేసుకో.

సూర:- గుడ్డలేమిటోయ్‌! మనిష్యులేమారిపోతుంటేను పిచ్చి నాయనా!

మోహ:- (నెమ్మదిగా) నా మాటవినవూ ? బావా!

సూర:- (తెల్లబోయిచూస్తూ) ఏమన్నావ్‌ ? 'బావ' (నవ్వి) మోహన్‌! నీకూ నాకూ ఆ రుణంతీరిపోయింది. "ఇచ్చిన సమంధం చస్తేతీరుతుందంటారదే" మీా చెల్లమ్మని లోకం మింగింది. మన బావాబావమరుదులవరస 'కట్‌' అయింది కాదంటావా ?

మోహ:- ఏమిటామాటలు బావా!

సూర:- ఏం ? అబద్ధమా? నువ్వు నాదగ్గిర నిజందాస్తున్నావు. నా మొహంచూచిచెప్పు. శారద నిజంగా బ్రతికివుందా ?

మోహ:- నువ్వు అధైర్యపడకు శారద బ్రతికేవుంది.

సూర:- అబ్బాయ్! అధైర్యం మనదగ్గిరికేరాదు. మనవెంట వుండేది ధైర్యమే! ఆ ధైర్యంతోనేగా యెక్కడికక్కడ క్లోజ్ చేసిపారేశాను. నీచమైన వాతావరణంలో పెరిగాను కాదుకాదుతిరిగాను. సావిత్రినినమ్మి దానికారుకూతలకి తలవంచాను. (నవ్వి) నా హృదయకుసుమం శారదని, నా జీవితకుసుమంబాబుని స్వర్గానికి బదిలీచేయించాను. (నవ్వి) పిచ్చివాడా! యింకానాకు అధైర్యం యెందుకుంటుంది?

మోహ:- (విసుగ్గా) పిచ్చి నీకానాకా? చెప్పినమాటవినవేం?

సూర:- నీమాటవిన్నట్లయితే యిలాయెందుకుంటాను? మనం వొకరిమాటవినం. గట్టిగమాట్లాడితే పిచ్చివాణ్ణంటావు. అనూ. లక్షసార్లను. నేనువద్దన్ను. నోరునెప్పిచేసేదాకా అను. అసలేవద్దనను. పిచ్చియెవరికి? నీకు. కాదంటావా? నువ్వన్నా మన్నిచూశేవాళ్లందరికీ తెలియటల్లా. చచ్చిన వాళ్లంతా బ్రతికున్నారంటావు. బ్రతికున్నవాళ్ళంతా చచ్చారంటావు. అంతేనంటావా?

మోహ:- (విచారంగా) శారద బ్రతికుందంటే నమ్మలేక పోతున్నావా బావా!

సూర:- నమ్మను బ్రతికుంటేయేది? చెప్పు.

మోహ:- దారితప్పి యెక్కడో తలదాచుకొనుంటుంది. పత్రికల్లో ప్రకటించాను.

సూర:- (పత్రికచూపిస్తూ) యిదిగో... పత్రికనాచేతిలోనే వుంది. కాదన్నానా?

మోహ:- వూరూరాగున్న పోలీస్టేషన్లన్నింటికి రిపోర్టు లిచ్చాను.

సూర:- అదీవిన్నాను. యిన్నీ చేశావుకదా! అది నిజంగా బ్రతికుంటే యెందుకురాదు? యిష్టంలేకరాలేదనుకుందాం. వొక్క ఆడదాన్ని యీ పోలీసుశాఖవారంతా పట్టుకో లేకపోయారా? పత్రికచదివేవాళ్లంతా పట్టుకోలేకపోయరా? పత్రికలు పోలీసువారు యీలోకంలోనే వుండేది. పైలోకంలో వుండను. అక్కడవుంది నా శారద. కొన్ని పత్రికల్ని వీలుగావుంటే పైకిపోస్టులో పంపించరాదూ?

మోహ:- బావా! నువ్వు అనవసరంగామాట్లాడి మనస్సు పాడుచేసుకుంటున్నావు.

సూర:- ఎప్పుడు?

మోహ:- ఇప్పుడే!

సూర:- ఆరిపిచ్చివాడా! యిప్పుడుకాదు. యింతేనా నువ్వు గ్రహించింది? నా బాబు చచ్చిపోయాడని పిడుగులాంటి వార్త నీ నోటివెంట యెప్పుడువిన్నానో అప్పుడే! శారద కోసం ప్రకటించిన ప్రకటన పత్రికలో యెప్పుడుచూశానో అప్పుడే. యిప్పుడంటావేమిటి? "చచ్చినవారూ లేచిరారురా చింతమానరాజీవా"

మోహ:- యెన్నిచెప్పినా నీ బుర్రకెక్కటల్లేదు.

సూర:- అదేగా అలవాటయింది.

మోహ:- పోనీకానీ, కాశేపు ఆ మంచంమీదపడుకో.

(యింతలో టెలిఫోనుబెల్ వినపిస్తుంది. పోనుదగ్గిరకువెళ్లి

మాట్లాడతాడు) హలో!... ఆ మోహనరావునే... యెక్కణ్ణుంచిమాట్లాడేది? పోలీస్ స్టేషనా? యేమిటీ విశేషం? శివపాదాన్ని విడుదలచేశారా? వెరీగ్లాడ్... చూడండీ. యిన్సెపెక్టర్ గారూ! రాముడొచ్చాడా అక్కడికి? యింకారాలేదూ. శివపాదాన్ని తీసుకురమ్మని పంపాను. ఆహా! అయితే వొకపనిచెయ్యండి. అతన్ని అక్కడేవుండమనండి రాముడువచ్చాక వాడితో యింటికి రమ్మనండి. ఆ ఆ. యిందాక నేబయల్దేరాడు. యెక్కడ ఆడుకుంటున్నాడో. వచ్చేదాకా అక్కడే వుంచుతారుకాదూ!... ఆఁ! చూడండీ. శారద ఆచూకీ యేమన్నా... లేదూ... (నీరసంగా ఫోను అక్కడపెట్టి వెళ్లి కుర్చీలో కూలబడతాడు)

సూర:- (సమీపించి) చూడు... యిప్పటికైనా శారద చచ్చిందని నమ్ముతున్నావా?

మోహ:- (పెద్దగా విసుగుతో) బావా!

సూర:- (తెల్లబోయిచూస్తూ) అరె. వున్నమాటంటే అంత కోపమెందుకోయినీకు? శివపాదాన్ని విడిచిపెట్టారా? విడిచిపెట్టాల్సిందే. వాడుచాలామంచివాడు. వాడి భార్య చేసినఘోరాలకి వాడాకారకుడు. గవర్నమెంటు చాలా న్యాయంగా చూసింది యీ విషయంలో. అదిచస్తే వాణ్ణి అరస్టుచేయడం తప్పుకాదు! చూడు... పాపం... వాడికి యెక్కడన్నా నౌకరీ యిప్పించేం... అదేమిటోయ్! అస్తమానం అలా ఆలోచిస్తావు. పోయినవాళ్లనిగురించి

ఆలోచించగూడదు ... బ్రతికుండి, భూమిమీఁదుంటే యింతహడావిడీ చేసినా యెందుక్కనుపించదు...

మోహ:- బావా!

సూర:- అవునోయ్! నువ్వు ఆదర్శపురుషుడవే. ప్రపంచంలో జరిగే హత్యాచారాల్ని రూపుమాపాలని ప్రయత్నం చేస్తున్నావు. బాగా నేవుంది. అదిచాలామంచిపనే! కాని లాభం? నీమాట యెవడన్నా వింటున్నాడా? ప్రపంచంలో న్యాయం, ధర్మం, యెక్కడున్నాయ్? అవి యెవరికి కావాలి? మంచిని విని అందరూ మంచిగా ప్రవర్తిస్తుంటే ప్రపంచం తారుమారైపోదూ? అన్నట్లూ శివపాదం అరస్టయిన సంగతినాకు తెలియనే తెలియదు. యెందుకయ్యాడంట్రావ్?

మోహ:- (విసుగ్గా) శివపాదమే సావిత్రిని చంపాడనే నమ్మకంతో అరెస్టుచేశారని యెన్నోసార్లు చెప్పాను.

సూర:- అంతవిసుగెందుకోయ్! కాపరం సరిదిద్దుకోమని చెప్పలా? విన్నానా? అప్పుడే నీ మాటవింటే, కాలెందుకు విరుగుతుంది? వంశం యెందుకునాశనమౌతుంది? వినట మనేది మనజాతకంలో నేలేదోయ్.

మోహ:- (జాలిగా) బావా! అనవసరంగామాట్లాడి మనస్సు పాడుచేసుకుంటున్నావు. యిల్లా మాట్లాడావంటే వైజాగ్ పిచ్చాసుపత్రికి పంపుతాను.

సూర:- (సంతోషంతో) భేష్! బాగుంటుంది. ఇక్కడకంటే అక్కడే బాగుంటుంది. నాలాంటివాళ్లు అనేకమంది

వుంటారు. అందరంకలసి అక్కడేహాయిగా ఆడుకుంటూ పాడుకుంటూవుంటాము. అయినా మోహనరావ్! మనస్సు పాడుచేసుకోవటమేమిటి? చేసుకున్నాను. యింకా నీకు తెలియదూ? యీ జన్మలో మనస్సుకి రిపేరుచేశేవాడు లేడు. యెందుకుంటారు? సన్మార్గులు నాలాంటిదుర్మార్గుల్ని చూస్తే భయపడతారు. దగ్గరకురారు.

మోహా:- బావా! నా మాటవిను.

సూర:- బ్రతికుంటేకాదుటోయ్ వింటానికి! నేను కాలువిరిగినప్పుడే చచ్చిపోయాను. నేనేకాదు. అన్యాయంగా జీవించేవాళ్లంతా నాలాగేచచ్చిపోతారు. పుట్టటం చావటంకోసమేగా? యెంతభోగభాగ్యాలు అనుభవించినా ఆఖరికి మహారాజైనా మట్టిలోకలిశేవాడే. కూలోడైనా మట్టిలో కలిసేవాడే. ముష్టియెత్తేవాడుకూడా మట్టిలోకలిసేవాడే. అలాగేముందునాబాబు, తర్వాతనాశారద, తర్వాతమనం సీరియలునంబరుగా చచ్చిపోయాం. నామాటవిని నువ్వు కూడా చచ్చిపోకూడదూ? నీ మాటయెవరు వింటారని బ్రతికుంటావు? (రాగరూపంలో) "లాభంలేదురా నారాయణ" దరరినాం, దరినాం, దరినాం అఅఅఆఆం... (టెలిఫోను మళ్లీ కాల్ చేస్తుంది) అదిగోమళ్లీ మోగుతుంది యీ సారి యేం మాట్లాడతారో తెలుసా? వడ్లగింజలో బియ్యపుగింజ అంతే (నవ్వుతాడు)

మోహా:- (ఫోన్ దగ్గిరకువెళ్ళి) ఉండుబావా! (రిసీవరుపైకెత్తి చెవుదగ్గిర పెట్టుకుంటాడు) ఆఁ! నేనే... మోహనరావుని

శ్రమఫలించిదా? ఏమిటి? ఆ! యేమన్నారూ? శారద దొరికిందా? (సంతోషంతో) నిజంగానేగా పాలమ్ముకుంటుండగా పట్టుకున్నారా? ఏవూళ్లో ... విజయవాడలోనా? యిక్కడికి తీసుకొచ్చారా? అరెస్టుచేసి తీసుకొచ్చారా? సంతోషం. నన్నుబయల్దేరిరమ్మంటారా? వద్దూ...మీరే తీసుకొస్తున్నారా? థాంక్సు (Thanks) ఆఁ! రాముడువచ్చాడా? శివపాదాన్ని రాముణ్ణి యింటికి పంపారా? కంగ్రాచులేషన్సు. శారదని తొందరగాతీసుకొస్తారుకాదూ? (సంతోషంతో రిసీవరు అక్కడపెట్టి) విన్నావా?

సూర:- (తెల్లబోయిచూస్తూ) ఏమిటి?

మోహ:- శారదదొరికిందిట... యిప్పుడేమంటావు?

సూర:- (వికిలిగా నవ్వి) యిదొకనాటకం... ఆడండి... నీతో నాటకమాడటానికి పోలీసువాళ్లుకూడా యేకీభవించారూ? ఆడండి... యింకేం... కలక్షన్ నిల్... హాలు ఫుల్...

మోహ:- అప్పుడు నాకెంతో సంతోషంగావుంది.

సూర:- నాకులేదూ? నువ్వుకూడా నాతోపాటు పిచ్చోడివై పోతున్నావని...

మోహ:- ఏమిటిబావా ఆపిచ్చిమాటలు?

సూర:- పిచ్చిమాటలా? నాకు పిచ్చెక్కిందా? అంటేయెట్లా వుంటుంది? యెవరికి పిచ్చెక్కిందో తెలియటల్లా! కాకపోతే శారద దొరకటమేమిటి?

మోహ:- నిజంగాబావా!

సూర:- కాదోయ్! శారదలాంటి శారద

మోహ:- యేమిటామాటలు?

సూర:- మానవసమాజంలో యీ మాటలంటే నే హుషారోయ్. మేముధన్యులం. నేను, నాబాబు, నాశారద చచ్చిపోయాక, మీరంతా యేంచేస్తున్నారోనని చూట్టానికి మనం బ్రతికివచ్చాం. పాపాత్మున్ణికాబట్టి నా కా శక్తివుంది. మీ చెల్లెలు యేం పాపంచేసిందని బ్రతికివస్తుందంటావు. కాబట్టి నీ మాటలు నేనునమ్మను. (తెరలో కారుహారను వినిపిస్తుంది) యెవరోవస్తున్నారు. పోలీసువాళ్లేమో! వాళ్లయితే మంచివాళ్లని పట్టుకు పోతారు. జాగ్రత్త యెక్కడయినాదాక్కో... నేనూ దాక్కుంటాను. (లోపలికి వెళ్తాడు)

యస్. ఐ:- (ప్రవేశిస్తాడు)

మోహ:- (ఆదుర్దాగా) యేదిసారద.

యస్. ఐ:- తొందరపడకు. యెంత సేపటికీ నాకు ఘుమ్మోరతా లేరంటుంది. మావ్వాప్రక్కనవుండు. మాటలువినిపిస్తాను.

మోహ:- (ప్రక్కకుపోతాడు)

యస్. ఐ:- (ప్రక్కకుతిరిగి) యేయ్! యెట్ తర్టీభోర్! ఆ అమ్మాయిని ఘిలాకీసుకురా.

పోలీ:- (శారదని వెంటపెట్టుకు ప్రవేశిస్తాడు)

యస్. ఐ:- నీకెవ్వరూ లేరన్నావుకాదూ! నిజంచెప్తే వదిలి

పెడ్తాను. లేకపోతే అరష్టుచేసి పాలల్లోనీళ్లుకలిపి అమ్ము తున్నందుకు అండమాన్సు పంపే ప్రయత్నంచేస్తాను.

శార:- (విచారంగా) నా మాటనమ్మండి. పాలల్లో నీళ్లుకలిపి అమ్మటల్లేదు అందుకుభగవంతుడే సాక్షి. మీ పోలీసువాళ్ళు అన్యాయంగా పట్టుకొని నామీద యీ నేరాన్ని మోపారు.

యస్. ఐ:- అది అలావుంగని. నీ తాలూకు వాళ్లెక్కడనా వున్నారా?

శార:- లేరండీ!

(రాముడు శివపాదం వస్తారు)

యస్. ఐ:- వాళ్లెవరో తెల్సునా?

రాము:- (తెల్లబోయిచూస్తూ) శారదమ్మగోరు.

శార:- (వాళ్లనిచూసి) వాళ్ళు నా తాలూకువాళ్ళుకాదు. నేనంటేగిట్టని సమూహంలోనివాళ్ళు.

యస్. ఐ:- నీభర్త

శార:- లేరు.

యస్. ఐ:- నీ పేరు?

శార:- దుర్గమ్మ.

రాము:- అదేంటండీ అమ్మగోరూ! అట్టామాట్టాడతారు. మీ పేరు శారదమ్మగోరుకాదూ? యెదవని నాకు తెల్దను కుండారా?

శార:- ఎలామాట్లాడాను? అవన్నీనీకెందుకు. నిన్నవరడిగారు ఫో ఇక్కణ్ణుంచి.

శివ:- మనలోమనమాట. మా ఆవిడ చేసిన పొరపాట్లు యిప్పుడన్నా మర్చిపోతారుకాదూ!

యస్. :- మీరు కాస్సేపువుండండి మాష్టారూ! అమ్మాయ్! మోహన్ రావు అంటే యెవరో తెల్సా?

శార:- (తెల్లబోయిచూస్తూ) మోహన్ రావుగారా?

యస్. ఐ:- అవును. ఆ ఫోటోలోవున్న వ్యక్తి (ఆ గోడవైపు చూపెస్తాడు)

శార:- (పొంగిపొర్లే దుఃఖంతో బరువుగా) తెలియదు.

యస్. ఐ. మోహన్ రావుగారూ!

మోహ:- వస్తున్నా. (ప్రవేశిస్తాడు)

శార:- (పొంగిపొర్లే దుఃఖంతో) అన్నయ్యా! (కౌగలించుకుంటుంది)

యస్. ఐ. మీ బావగారు...

సూర:- ఎవరక్కడ యేదోమార్కెటు వోవెన్ చేశారే (అంటూవస్తాడు)

శార:- ఏమండీ! (అంటూ ఆదుర్దాగా కాళ్ళుపుచ్చుకుంటుంది)

సూర:- ఎవరు? పాపాత్మురాలి కాళ్ళుచ్చుకుంటున్నార (చూస్తాడు)

శార:- దుర్మార్గురాల్ని క్షమించండి.

సూర:- ఎవరు నువ్వు?

శార:- మీ శారదని.

సూర:- ( తెల్లబోయిచూస్తూ శారదని పైకి లేవనెత్తి కళ్ళల్లో కళ్ళుపెట్టిచూచి కోపంతో) ఎవరునువ్వు? నా శారదవా? నువ్వు నా శారదవా? కావు, కావు. నా శారదవికావు. (బలంగాతోసి) ఫో! నా కళ్ళ యెదుటనుంచి లేచిఫో! (అందర్నీ పిచ్చిగాచూచి) అంతా మోసం చేస్తున్నారునన్ను అంతా వెళ్ళండి... ముందు వెళ్ళండి.

శార:- (విచారంగా) ఏమిటన్నయ్యా! యిలామారిపోయారు?

సూర:- (హేళనగా) అదా చెల్లయ్యా! మోసం... నాకు నమ్మకం కలగటానికి యీ నాటకం మొదలుపెట్టారు. (నవ్వి) అన్నయ్యా, చెల్లయ్యా, బాగున్నాయ్. రెండు పేర్లూ బాగున్నాయ్. వెళ్ళండి.

శార:- (కాళ్ళుపట్టుకొని) నేను మీ శారదనండ... నామాట నమ్మండి. యింకా నన్ను నమ్మటల్లేదా?

సూర:- (పరిశీలించి) శారదవికావు. సావిత్రివి. వ్యభిచారిణివి. నా ప్రాణాలు తీయాలనే సంకల్పంతోవచ్చిన మృత్యుదేవివి. పోతావా పోవా! ఫో! ఫో!!

మోహ:- (పెద్దగా) బావా!

సూర:- (కోపంతో) యేమిటోయ్ నువ్వుచెప్పేది? కళ్ళెర్ర చేస్తే కాదనలేననుకుంటున్నావా!

మోహ:- (గొంతుపెగల్చుకు పెద్దగా) బావా!

సూర:- నోర్ముయ్! (శారదతో) పోతావా పోవా? నా కెదురుగా లేచిపోతావాపోవా? ఫో! !! ఫో!!!

(వుద్రేకంలో కాలువిరిగినసంగతి మర్చిపోయి రెండో
కాలితో తంతాడు. చంకలో కర్రలు జారిపోయి క్రింద
పడతాడు) బాధ... బా...ధ... (తలనుంచి రక్తం
కారుతుంది)

మోహ:- (ఆదుర్దాగా [illegible])

శా:- సూరయ్యతల తన వళ్లో పెట్టుకొని చీరకొంగుచం
రక్తంతుడుస్తూ వుంటుంది)

యస్. ఐ:- (కళ్ళ వెంట నీరు కారుస్తాడు)

సూర:- (అక్కడున్న అందర్ని ఒకసారిచూసి శారదనికూడ
తెల్లబోయి చూస్తాడు)

యస్. ఐ:- నామాటవినండి. ఆవిడగారు మీ యిల్లాలు
శారదే!

సూర:- (తెల్లబోయి చూస్తాడు)

మోహ:- (ఫోనులో మాట్లాడుతాడు) ... [illegible]!
మెవరామాట్లాడేది? డాక్టరుగారేనా? వొక్కసారి మీరు
అర్జంటుగారావాలి... నా పేరా మోహన్రావు. చాలా
ప్రమాదమైనది. వస్తారుకదూ! రాగానే చెప్తారా! ఆ!
అహ!... అయితే మీరెవరు? డాక్టగారి వైఫా...
బయటకి వెళ్లారా! రాగానేపంపండి... థాంక్స్. (రిసీవరు
అక్కడపెట్టి శారదని సమీపిస్తాడు)

సూర:- (శారదనిపరిశీలిస్తూ నెమ్మదిగా) శారద శారదేనా!

రాహ:- అవును బావా! నామాటనమ్మవూ?

శారి:- నమ్ముతాను... (శారదనిచూస్తాడు)

శా:- ఏమండీ!

శారి:- శారదా!... అబ్బ... బాధ...

రాహ:- (ఆనంద భాష్పాలు రాలుస్తాడు)

యస్. ఐ:- శివపాదం రాముళ్ళనిచూసి చిరునవ్వు నవ్వుతాడు)

శి:- (యస్.ఐతో) మనలోమనమాటఅంతా మీ చలవేగా!

రాము:- యదవని అదేగా నాను శెప్పేదిను. (నవ్వి సబ్దం రాకుండా నోరుమూసుకుంటాడు)

యస్. ఐ:- (లేచి) మోహనరావుగారూ! తొందరగా కట్టు కట్టించండి. లేకపోతే ప్రమాదం. (శారదతో) ఏమమ్మా. నీకేవరూ లేరన్నావు. కష్టాలు వచ్చినంతమాత్రాన అయిన వాళ్ళనికాదంటారా? మర్చిపోతారా? వస్తాను. (వెళ్తాడు)

శివ:- మనలోమనమాట. ఏమన్నా వినబడుతుందా?

రాము:- యదవని అడుగుతుండా అదేటని?

శివ:- పాట— అదేం! వినబడటల్లా! విను.

(తెరలోపాట వినిపిస్తుంది)

ఓ భారతీయులారా! యువతీ యువకులారా!...

యువకుల్లారా! యువతుల్లారా!